ఓం

# తారాశశాంకము

inted 5, 000 Copies on paper supplied by The National Newsprint and Paper
mpany Ltd. Neepanagar, on 5–9–59 for Andhra Ratna Book Depot, Tenali

UDL/RCP

రచన:
దరిశి వీరరాఘవస్వామి




పబ్లిషర్సు
ఆంధ్రరత్న బుక్‌డిపో తెనాలి.
టెలిగ్రామ్సు: "సాయిబాబా" ఫోన్ నెం 64
ప్రొ॥ గ్రంధి లక్ష్మయ్య గుప్త
రైల్వేస్టేషన్ రోడ్, తెనాలి–2

కాపీరైటు 1959 వెల 1-4-0

## —: ముఖ్య పాత్రలు :—

అత్రి

నారదుడు

చంద్రుడు

బృహస్పతి

దేవేంద్రుడు

రక్తి

ముక్తి

శుక్రుడు

మాతలి

## స్త్రీలు

తార

అరుంధతి

పద్మ

ఇంకను సమయానుకూలముగా

ఓమ్

# తారాశశాంకము

## ప్రథమాంకము

### 1 వ రంగము

నాంది

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయే॥

(నాందంత్యమున సూత్రధారుడు ప్రవేశము)

సూత్ర—నటీ! నటీ!

నటి—(ప్రవేశించి) నాథా! ఎందుల కింత తొందరగ బిలిచితిరి?

సూత్ర—నీ వెంతవనుక రాకున్న పిలువక నేమి చేయవలయును?

నటి—ఆలస్యమునకు మన్నింపుడు. ఇవుడు నన్ను పిలిచిన పనియేమి?

సూత్ర—ఏమియో తెలియదా?

గీ. ఉత్తమంబైన నాటక మొండు గనగ
సభికు లాసీనులై యుంట— జాలమగుట
పాత్రల నలంకరింపంగ వలయు నంచు
చెప్ప బిలిచినాడను నిన్ను శీఘ్రగతుల.

నటి—బాగున్నది. మీ వాక్చాతుర్యము! ఇంతకు నాటకము పేరేదియో చెప్పకుంటిరిగదా!

సూత్ర—అటులనా! మనము ప్రదర్శింపనున్న నాటకము తారాశశాంకము. తారాశశాంకము మిగుల రసవత్తరమైనదియేగాక; నీతిదాయకంబు నగుటంజేసి దానినే ప్రదర్శింప నెంచితిని.

నటి—నిజము; నిజము. మరి నాటక రచయితగారి పేరునుగూడ వినిపించెదరా?

సూత్ర—అందు కథ్యంతర మేమున్నది? ఆ కవి;

సీ. గుంటూరు సీమలో కొమరొప్పు విద్దెల
పూడి నివాసుండు; భూసురుండు
నిరతాన్నదాతయు నిత్యసత్యవ్రత
దీక్షాపరుండు, ముక్తి ప్రదాత
రంగయాఖ్యుండు, భారద్వాజ గోత్రుండు,
దరిశి వంశాబ్ధి సుధాకరుండు,
అర్ధాంగి లక్ష్మీబాయమ్మ; నవ్వారికి
జననమందెను శేషయాఖ్యుఁ డెలమి

గీ. వారి పత్ని లక్ష్మమ్మ గర్భంబునందుఁ
గలిగె నేకైక పుత్రుండు; కవివరుండు;
వీరరాఘవస్వామి నా పేరవెలసి
దీని రచియించె సరసవిధానముగను.

నటి—ఓహో! వారు కవిమిత్రులలో నొకరుగదా? వారి రచనకేమి? మనోహరమై, నిర్దుష్టముఁగనేయుండును. ప్రాణేశ్వరా! పాత్రాలంకరణ పూర్తియైనది. అదిగో అత్రిముని యాశ్రమంబు. అందు చంద్రున కుపనయనంబుచేసి మాతాపితృదేవులు భిక్ష నొసంగుచున్నారు.

సూత్ర—అటులైన మనమును త్వరగబోదము పద.

నటి—ఔను. అందే బృహస్పతి భగవానులుగూడా యుండిరి. చంద్రు నా బాలునియొద్దనే విద్యాభ్యాసముచేయ నంప దలంచియున్నారు. సకల దేవగణంబునకు పురోహితుండును-గురుచంద్రుండునగు నా బృహస్పతికి నమస్కరింతము.

సూత్ర—మంచిది. అటులనే చేయుదము రమ్ము.

నటి—చిత్తము—

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది నాందీప్రస్తావన సమాప్తం.

## రెండవ రంగము

(అత్రిముని యాశ్రమమునందు చంద్రుడు ఉపనయనంబు నొందిన వటువువై నిలుచుండి యుండును; అనసూయ; అత్రి; బృహస్పతులును నిలుచుండి యుండ దెర లేచును.)

చంద్రుడు—భవతీ భిక్షాందేహి! భవతీ భిక్షాందేహి! భవతీ భిక్షాందేహి!

అనసూయ—తథాతు; (భిక్ష పెట్టును.)

చంద్రు—భవాన్ భిక్షాందేహి! భవాన్ భిక్షాందేహి! భవాన్ భిక్షాందేహి!

అత్రి—తథాతు (భిక్ష పెట్టును.)

చంద్రు—భవాన్ భిక్షాందేహి! భవాన్ భిక్షాందేహి! భవాన్ భిక్షాందేహి!

బృహస్పతి—తథాతు. (భిక్ష పెట్టును.)

అత్రి—దేవా! మహానుభావా!

కం. ఉపనయనంబందిన వటు
వపమార్గంబును బట్టకుండ నగు శాస్త్రములన్
కృప చెప్పుమటంచును నే
నిపుడబలికి; వప్పగింతు నితని మునీంద్రా!

బృహ—అటులనే వీనిని శిష్యునిగ స్వీకరించితిని.

అత్రి—ధన్యుడను.

బృహ—చంద్రా!

చంద్రు—గురుదేవా!

బృహ—నీవు నా శిష్యుండవుజుమీ!

చంద్రు—చిత్తము గురుదేవా!

బృహ—ఈ చిత్తము నిమిత్తమాత్రమే చంద్రా! ఇప్పటికి బాలుడవు—ఇప్పుడు నవయవ్వన మంకురించుచున్న బ్రహ్మచారివి. ఇంతదనుక నీ కృత్యములకు విచారణయేలేదు—ఇకమీద చేయు పాపములకు ప్రాయశ్చిత్తమున్నది. నేటివరకు నీవు వసించినది తల్లిదండ్రులవద్ద నిజ

గృహమందు—రేపటినుండి నీ వుండవలసినది తారా బృహస్పతుల శిష్యత్వంబున గురుయాశ్రమమందు. తెలియునా ?

చంద్రు—తెలియక బోవుటేమి భగవాన్! మీరే సెలవిచ్చు చుంటిరిగదా?

బృహ—మంచిది చంద్రా !

మ. చదివింతున్ నిను వేదశాస్త్రములనే సర్వంబు, జ్ఞానంబు నీ
కాదవన్ నీతియుతుండవై నిజయశం బొప్పార వర్తించి; మా
హృదయంబుల్ ముదమందునటు లీవే జేయుమో చంద్ర ! నీ
వదనంబున్ గనువారల్లె "రితదే నా, చంద్రు డంచా"దగన్.

చంద్రు—పూజ్యుల ఆశీర్వాద మన్యథా జరుగదుగదా ? తలిదండ్రులారా ! పరమపూజ్యులారా ! నేనింక బోయివచ్చెద. దీవించి పంపుడు.

అన—చిరంజీవీ ! నీవు మా గర్భంబుల నుదయించుట చేతనేగాక; దేవ గురూత్తములవారి ప్రియశిష్యుండ వగుటం జేసియు చరితార్థుడవు కాగలవు. పోయిరమ్ము.

అత్రి—నాయనా చంద్రా !

ఆ. వె. తోడిబాలురందు దొడ్డతనము జూపి;
చదువు సంధ్యలందు శ్రద్ధగలిగి;
తారమాట నెపుడు తలదాల్చి చరియించి
రసికుడవుసుగమ్మ ! రక్తిమీర.

బృహ—మునిదంపతులారా ! చంద్రుని గురించి మీకింక విచారమే లేదు. మాకింతదనుక సంతానమే లేదుగదా ? అత్రిమునీంద్రుని కనుంగు పుత్రుండగు నీ చంద్రుడు మా కన్యుండగునా ? మా యాశ్రమంబున మీ బిడ్డకు లోపముండునా ? నేను దేవేంద్రుని కోరికపై స్వర్గము కేగినపుడు, పాపము తార కేమియును తోచక యాశ్రమమందు యేకాంతము ననుభవించుచున్నది. నే నింటనుండని సమయంబులందు పుత్ర తుల్యుండగు మనచంద్రు డామె కొరతను దీర్చగలడు. తారయు తల్లి వద్దలేని కొరతను మరపించగలదు.

మ. చదువున్ సంధ్యజపంబు వేదములతో శాస్త్రంబు లన్నింటి నే
ర్పుదునేగాని; తదన్యకార్యముల నే లోపంబు రాకుండ స
మ్మదమొప్పన్ గను భారమంతయును తాబూనున్‌గదా తార, మీ
మదినిన్ శంకిల నేటికింక శశికై; మా యాశ్రమందుండగన్ ?

అత్రి—ఐన మేము ధన్యులము.

బృహ—మేమింక పోయిరావమ్మనా ?

అత్రి—చిత్తము.

బృహ—చంద్రా ! పోవుదమురమ్మా.

చంద్రు—అటులనే గురుదేవా !

(ఇరువురు నడచుచుండ తెరవ్రాలును.)

మూ డ వ ర ం గ ము

(బృహస్పతి యాశ్రమంబున తార; పద్మ కూర్చుండి
యుండగ తెరలేచును.)

తార—పద్మా ! మీ గురుచంద్రులవారు....

పద్మ—ఇంకను రాలేదమ్మా !

తార—పద్మా !

పద్మ—అమ్మా !

తార—వా రొక్కనాడైన యింటిలో స్థిమితముగ నుండరుగదా ? ఏనాడు చూచినను వారికి ప్రయాణములే- ప్రయాణములు లేకపోయినచో యాగకార్యములు - అవియును, తప్పినచో మరేదియో తర్కశాస్త్రావలోకనము- కాదా ? తపోదీక్ష- అంతకును మించిన వేదాధ్యయనము- లేకున్న నిష్ఠాలోలత. అబ్బబ్బా ! పద్మా ! నే ననరాదుకాని; సతతము సన్యాసిగోష్ఠిలో సంచరించు వారలకు సతులెందులకు ? సంసారము లెందులకే ?

చ. పడుచుల హావభావములపై నొకవేళనుగాని; బుద్ధియే
నడువని పూరుషాళికిక నాతులదేటికి ? పెండిలన్నచో
మెడలకు తాళిగట్టుటెసుమీ; యనుకొంటిరదేమొ? కట్టగా
కుడువగ బెట్టినంత సతికోరికలన్నియు దీరజాలునే ?

పద్మ—అమ్మా ! మీప్రశ్నలకు సమాధానమిచ్చునది నేనుకాదు—

తార—మరెవ్వరు ?

పద్మ—గురుమహాదేవులు.

తార—(చిరాకుతోకొట్టి) పోవే, నీవెప్పుడు నిట్టి కొంటెమాటలతో నాయెడ లుడికించుచుందువు.

పద్మ—తొందరబడకమ్మా ! బృహస్పతి భగవానులు వచ్చినతోడనే మీ విచారము తీరిపోగలదు.

తార—పద్మా ! నీమాటలకేమిగాని, నేనొక్క రహస్యము చెప్పనా ?

పద్మ—నీ యిచ్ఛయైనచో.

తార—యిచ్ఛయేలేకున్న ముచ్చటింతునా ? కాని, మరెవ్వరితోడను చెప్ప వని చేతిలో చెయ్యివేయుము. (చెయిచాచును.)

పద్మ—అదేమిటమ్మా! పద్మ మీకీనాడు క్రొత్తదా! నా ప్రాణము పోయి వను నీ పరువు పోనివ్వను. ఇదిగో మనసులోమనసుకలిపి చేతిలో చెయ్యి వేసితిని. ఇకచెప్పు.

తార—అనకూడదుకాని. రాత్రి వేకువఝామున నొక కలగంటినే.

పద్మ—కలయా ? ఎట్లు ? దుస్స్వప్నమా ? సుస్వప్నమా ?

తార—ఆ స్వప్నంబున రెండును గలవు.

మ. చెలియా ! జీవితమెట్లు మారుటకునో చిత్రంబునైనట్టి దా
కలగంటిన్; మనయాశ్రమంబుననె యొక్కండెవ్వడో రూపు రే
ఖల మీరంగల యవ్వనుండు నను బిగ్గం గౌగిటన్ జేర్చి దేహమున్
పులకింపన్ రతిదేల్చినట్టులకటా ! పున్నెంబు భంగంబుగాన్.

అప్పటినుండి నామనంబునదేవియో తియ్యతియ్యని తలంపులు అలలవలె; పెరలి, దొరలి వచ్చుచున్నవిగదా ? నే నేమి చేయుదును!

(రక్తి, ముక్తి తొందరగ పరుగెత్తుక వత్తురు)

రక్తి—అమ్మా! అమ్మా! గురుదేవులవారు.

ముక్తి—వచ్చు చున్నారమ్మా!

రక్తి—వచ్చేశారమ్మా.

(బృహస్పతి, చంద్రుడు ప్రవేశింతురు)

తార—(లేచి) భర్తృదేవులకు వందనములు.

బృహ—దీర్ఘసుమంగలీభవ!

పద్మ—గురుమహదేవా! ఈ బాలు డెవరు?

బృహ—ఇతడా? ఇతడే చంద్రుడు— ఇకమీద మన యాశ్రమ మందుండి సర్వవిద్యల నేర్వదగినవాడు.

తార—అటులనా?

బృహ—తారా!

ఉ. అత్రిమునీంద్రు కంట నుదయంబగు పాపడు వీడు – ప్రేమకుం
బాత్రుడు, బ్రహ్మచర్యమున వర్తిల నయ్యెడు వీనికింట నే
మాత్రము లోటురాక గనుమా! గురుపత్నివి నీ కితండునౌ
పుత్ర సమానుడౌట, మఱి పొందుము నీ కగు ముద్దు ముచ్చటల్.

తార—అటులనే మహాముని!

బృహ—చంద్రా! నీ వింక భక్తిశ్రద్ధల మెలంగ వలయును సుమా!

చంద్రు—చిత్తము గురుదేవా!

బృహ—పద్మా! రక్తి ముక్తులారా! మన యాశ్రమంబున కితడు క్రొత్తవాడు. వానిని మీరందరు తగుశ్రద్ధతో చూచుచుండవలయునుసుమా!

పద్మ—తప్పకుండ గురుమహదేవ్!

బృహ—శిష్యులారా! చంద్రుని గూడ నదికి గొంపోయి స్నానాదులను చేయించుకొని రండు. సంధ్యావందనంబు చెప్పవలయును. నేనును యింతలో నా జపతపంబుల బూర్తి గావించు కొందును.

(నిష్క్రమించును)

పద్మ—అమ్మా! చంద్రుడెంతటి రూపవంతుడమ్మా!

తార—ఔనే. ఆ అనసూయాదేవి పుణ్యమటువంటిది. ఆ చంద్రుని మోము చూచిన యేతల్లికి ముద్దాడ భ్రాంతిజనింపదే?

పద్మ—నిజమేనమ్మా!

శక్తి—అమ్మా! తారాదేవి మేము నదీస్నానమునకు పోయివత్తుము.

ముక్తి—రారా చంద్రా! స్నానానికి వెళ్లుదాం.

పద్మ—శిష్యులారా!

రక్తి—పద్మా! మేము గురుమహాదేవులు బృహస్పతి భగవానులవారి శిష్యులముగాని, నీకు గూడ శిష్యులమేనా?

ముక్తి—ఈసారికంటే, అన్నావుగాని—యికమీదట యిలా పిలువబోకు, జాగ్రత్త.

పద్మ—మరేమని పిలవాలి?

ముక్తి—మాకేం పేర్లు లేవా?

రక్తి—అదికాదే? తారాదేవి అమ్మగారు మమ్ముల్ని తమ్ముళ్లలాగా నిన్ను కూతురులాగా చూస్తున్నారుగదా? "మరేమని పిలవాలి" అనకపోతే, ఆమాత్రం తెలియదూ?

ముక్తి—ఇంత తెలివితక్కువ దద్దమ్మవు మాకెక్కడ దొరికావే?

రక్తి—మర్యాదగ వరసపెట్టి పిలవరాదూ!

పద్మ—(చిరాకుతో) చాల్లే నోరు ముయ్యండి.

ముక్తి—అలాగే.

పద్మ—చంద్రుడు క్రొత్తవాడు. నదులకు పోవటం—స్నానాలుచేయటం తెలియదు. (తారతో) ఏమమ్మా?

తార—ఔనే. మన యాశ్రమ బాలుర వలె చంద్రుడు ్దుడుకువాడుకాక మేదకునివలె నున్నాడు. ఐనను తెలియని నీటిలో దిగటం మంచిది కాదు. పద్మా! గురుదేవులవారికి స్నానాది వపతులు పూర్తిగావించిన తరువాత; చంద్రునికి గూడా వేడినీరు తోడు.

రక్తి—ఏరా! తమ్ముడూ! మమల్ని వెళ్ళమంటావా?

పద్మ—చంద్రుడు మీకు సమాధానం చెప్పవలయునా? నేను చెప్పాను. దేవి తారమ్మగారు చెప్పారు. చాలదా. వెళ్ళండి.

ముక్తి—సరె, నీవుపోయిస్నానంచేసి రారా! రక్తీ!

రక్తి—మరినీవో?

ముక్తి—నాకు కొంచెంబడలిక వున్నదిరా? చన్నీళ్ల స్నానంచేస్తే జబ్బు చేసేలాగుంది. నేనుగూడా చంద్రుడితోబాటే కాసిని వేడినీళ్ళంటె స్నానంచేస్తాను.

రక్తి—నాకుగూడా రోగంవచ్చే లాగున్నదిరా? పద్మా! ఆ చంద్రుడికి కాచిన చేత్తోనే మాకుగూడా మళ్ళీ కాసిన వేడినీళ్ళు తోడుమా? అసలే చలికాలం—అందుకుతోడు రోగం వచ్చిందంటే మళ్ళీవదలదు.

పద్మ—అలాగేం? ఐతే, మీరోగం నేను కుదురుస్తానులే. వుండండి. (అని ప్రక్కనున్న బెత్తంతో యిద్దరిని కొట్టును.)

రక్తి,ముక్తి—(పరుగెత్తుదురు.)

పద్మ—(కోపంతో రక్తిముక్తివైపు తెరలోనికి చూచుచు)మాయ రోగం, వదిలి పోయిందిలే పొండి. (తారవైపుచూచి) అమ్మా! మీరింక లోపలకు దయచేయండి. నేను చంద్రుని స్నానం చేయించుకొని తీసుకొని వస్తాను. మఱల గురుదేవులవారు వేంచేయుదురేమొ?

తార—పద్మా! మీ గురుదేవులవారు చంద్రుని మంచి చెడ్డలు చూచు బాధ్యతను వప్పగించినది నాకు.

పద్మ—చిత్తం. మీరే చూడండి.

(తెర బడును)



ఓమ్

# తారాశశాంకము

## ద్వితీయాంకము

### మొదటి రంగము

(వనమున రక్తి, ముక్తి. ప్రవేశింతురు.)

ముక్తి— ఓరేయ్ రక్తీ!

రక్తి—ఎమిట్రా ముక్తీ!

ముక్తి—చంద్రుడు మన యాశ్రమంలో చేరినప్పటినుండీ, మనవిషయం మఱీ శూన్యంగా వున్నదిరా!

రక్తి—ఔననుకొ.

ముక్తి—అనుకొనే దేమిటిరా నీ మొఖం.

రక్తి—అదేరా! నేనూ అనేది.

ముక్తి—ఏమంటున్నావు?

రక్తి—ఈ చంద్రుడిమీద వీళ్లకింత మమకారం యెందుకూ? అని—

ముక్తి—ఎందుకా మనకర్మ కాలేటందుకు.

రక్తి—ఔనౌను.

ముక్తి—ఔనని వూరుకుంటావేమిరా?

రక్తి—నన్నేమి చెయ్యమంటావు?

ముక్తి—ఏమిచేయటానికైనా మనకేం అధికారమున్నదిరా? తారాదేవి అనుగ్రహం వాడిమీద పడిచస్తూంది— పద్మ మమకారం అంతకన్న పట్టపగ్గాలు లేకుండవున్నది.

రక్తి—కాదటరా మరి? చంద్రుడు రాకముందు పద్మకాస్త మనతో పలకటం—మాటాడటం వుండేది, ఇప్పు డంటావా? ప్రొద్దస్తమానమూ

చంద్రుడే. చంద్రుడు కనుపిస్తేనే అన్నం తింటుంది—చంద్రుడు మాటా డితేనే మంచినీరు త్రాగుతుంది.

ముక్తి—అరేయ్రక్తీ!

రక్తి—ముక్తీ!

ముక్తి—ఒక పద్మె కాదురా! మన గురుపత్నిగారైన తారాదేవికి గూడా చంద్రుడు కనుపించకపోతే మద్దమింగుడు పడటంలేదురా! ఆమెకు గురుమహాదేవులు బృహస్పతులవారి సేవకంటే యీ చంద్రుడి పరి చర్యలే యెక్కువైనవి.

రక్తి—గురువుగారుగూడా చంద్రుడంటే అభిమానం చూపుచున్నారురా?

ముక్తి—ఔనురా: మన యాశ్రమంలో చంద్రుడందరికీ యిష్టుడేగా?

రక్తి—మన యిద్దరికి తప్ప.

ముక్తి—ఔను. వాడువచ్చిన నాటినుండి మననోట కరక్కాయపడినపుడు మనకెలా యిష్టుడౌతాడు?

రక్తి—ఆ చంద్రుడికి మనకూ యెంత తారతమ్యంవుందో చూచావూ?

ముక్తి—చూడక బోవటానికి నేనేం గ్రుడ్డివాడినా?

సీ. శాస్త్ర శాస్త్రాంగముల్ చదువనేర్చెనతండు;
సంధ్యయైన మనకు సరిగరాదు:
మేలైన చిరుతిండ్లుపాలు వాడికి నున్న
మాడుచక్కలతిండి మనకు గలదు;
కష్టించి పనిచేయు కర్మలేదతనికి
సుఖమనునది పూర్తి సున్నమనకు;
ఆదరింపులన్నియు నలరు చంద్రునకిందు
నిష్టురంబులుమెండు నీకు, నాకు;

ఆ. వె. ఆదరింపులచట; చీదరింపు లిచట;
చిన్నిమల్లెవాడు - జెముడు మనము;
అనుకొనంగనేల? నారాటమింకేల?
మదనచంద్రుదేడ? మనమిదేడ?

ర క్తి—ఒరేయ్, ము క్తి! అటుచూడూ! ఆ వనంలో ఆ చెట్టుక్రింద ఆ పద్మ - ఆ చంద్రుడితో కలిసి........

ము క్తి—అబ్బబ్బా! నేను చూడలేనురా!

ర క్తి—చూడాలిరా! చూడకపోతే మనం చేసేదేమున్నది? పవిత్రమైన యీ మునియాశ్రమంలో యే పాపం జరిగినా సరే; చూస్తూవుండట మేరా! మనం చేయదగినపని.

ము క్తి—ఐనా మనం పోదాంపదరా!

ర క్తి—తారాదేవిగారి కీ మాటచెప్పి; ఆమెనుగూడా తీసుకొని పోదాం పదరా!

ము క్తి—ఔనురా, మంచివుపాయం. పోదాంరా.

(ఇరువురు నిష్క్రమింతురు.)

## రెం డ వ రం గ ము

(ఉద్యానవనంలో పద్మ - చంద్రులు ప్రవేశము.)

పద్మ—చంద్రా! తార యెవరు?

చంద్రు—గురుపత్ని.

పద్మ—ఆమెతో నీకీ పరిహాసములు తగునా?

చంద్రు—నాకా? తారాదేవితోడనా? పరిహాసమా? పద్మా! ఎందులకు నన్నిట్లు గేలిచేయుదువు?

గీ. తార గురుపత్ని, నాకిందు తల్లివంటి
పరమపూజ్యురాలునగుట; పాపమిటులు
నాకు నంటగట్టగ నీకు న్యాయమగునె;
పద్మ! చాలింపు మీ వెఱ్ఱి పలుకులింక.

పద్మ—చంద్రా! నా వద్దనా ఏ దాపరికము? నేనా మాత్రము మీ చర్య లను గమనించుట లేదను కొంటివా? నే నంత మందమతి నను కొంటివా?

చంద్రు—పద్మా! నన్నెందులకు బాధింతువు? నేనేమియు నెరుగను.

పద్మ—నీ కెంతవరకు దెలియునో, నాకు పూర్తిగ దెలియును. చంద్రా! పద్మముందు నీ బొంకు చెల్లదు.

ఉ. చీరె ధరించువేళల, భుజించెడువేళల; పవ్వళించియున్
కూరుకుపోవువేళ; సఖుల్ తనుజేరినవేళ, నింకనె
వ్వారలతోడనైన సరె బల్కెడువేళలగూడ; నిన్ను నే
మారక చూచునంట, యనుమానములేక వచించు సర్వమున్.

చంద్రు—పద్మా! ఆమెచర్యల గురించి నన్నడుగకుము. నాకుమాత్ర మే పాపము తెలియదు.

ఉ. ఎన్నడుగాని నా హృదయ మీ కలుషంబు నెరుంగబోదు; నీ
వెన్నగ తప్పు నా యెడల నింతయులేదు; యదార్థమిందు, నే
కన్నదిలేదు; నీ కయిన ధర్మముగాదు, నకారణంబుగా
నున్నది లేనిదిన్ బలుకకో లలితాంగి, అభూతకల్పనల్.

పద్మ—చంద్రా! నీ విషయంబు కట్టిపెట్టుము. తారవిషయ మేమందువు?

చంద్రు—ఆమెవిషయము నాకేమి తెలియును?

పద్మ—తెలియదా?

చంద్రు—తెలియదు.

పద్మ—మొన్న నీకు తలంటి నీరుపోయుచు నామెపయ్యంట జారవిడువ లేదా?

చంద్రు—నేను చూడలేదు.

పద్మ—అది చూచి నీవు తలవంచుకొనలేదా?

చంద్రు—నాకు జ్ఞప్తిలేదు,

పద్మ—పోనీ అపుడునేను, అమ్మా! వలువ సవరించుకొనుమని చెప్పగ—నామె చిరునవ్వు నవ్వి "చంద్రుడు పరాయివాడు కాడులే" అనిన మాట నీవు వినలేదా?

చంద్రు—వినియుంటినేమో కాని; మరచిపోయినాను.

పద్మ—పోనీ, నిన్న ఆమె తల ధరించిన పూలు నీవు సరిచేయలేదా ?

చంద్రు—జడలోని పూలు జారిపోవుటచే సరిచేయమన్నది. ఆమె మాటను నిరాకరింపనేరక, సవరించినాను.

పద్మ— ఆ సమయంబున తారాదేవి "అటుగా దిటు—యిటుగా దటు" అనుచు తానును సవరించుచున్నటుల నటించుచు; తన చేతులు నీ చేతులతో పలుమారులు కలుపలేదా ?

చంద్రు—ఏమో, నాకు జ్ఞప్తిలేదు.

పద్మ—అదటు లుండనిమ్ము. ఈ ఉదయంబున తారాదేవి నీ పైన విసుగు చూపలేదా ? "రసికత్వములేని చదువు రాణింపునకు రాద"ని పరిహాసము లాడలేదా ?

చంద్రు—అన్నమాట నిజమే.

పద్మ — చంద్రా ! ఇంకెందుకు దాచెదవు ? ఆమె నిన్ను ప్రేమించుచున్నది. నీకు తెలియునా ?

చంద్రు—నాకు తెలియదు. పద్మా! ఆమె గురుపత్ని. ఇటువంటి మాటలనన్యాయము కాదు.

పద్మ—గురుపత్ని కాదని నే నంటినా ? కావుననే తారా దేవియు నీకు కొన్ని శాస్త్రములు బోధింప నున్నది.

చంద్రు—ఆశాస్త్రము పేరేమి ?

పద్మ—ఎరుగవా ? బృహస్పతి గురుదేవులవారు నీకు చెప్పక విడిచిన శాస్త్రమేదియో ఆ శాస్త్రము నామె పూర్తిచేయ నున్నది.

చంద్రు—దాని పేరు.

పద్మ—కామ శాస్త్రము.

చంద్రు—ఆఁ !

పద్మ—ఆఁ లేదు — ఊఁ లేదు,

చంద్రు—మరేమున్నది ?

పద్మ—తారకు నీపై మక్కువ యున్నది- నీ మనసులో భయమున్నది-

చంద్రు—పద్మా! నిజముగ నాకు భయముగనే యున్నది సుమీ.

గీ. తార సాహస కృత్యాల తారుమారు
లేమి సేయునోయంచు నా హృదయమందు
క్షణ మొక యుగంబు పోలిక గడుప వలసె
చెప్పరాని సంకటమయ్యె చేటటంచు.

మరియును;

ఉ. ఆమె చరించు చర్య మది కర్థముగాక, నొకొక్కవేళ. నా
కేమొ మనంబునందు భయమేర్పడు; ఔనని. కాదటంచు నా
కామవికార కృత్యములకై బదులాడగ లేకబోతినో
కోమలి! యిట్టి దుర్గతులకుం గురియైతి నికేమి సేయుదున్!

పద్మా! ఈ విషయంబును వినుము. నా కిందు నీ కంటె నా ప్తులె వెరును కనుపించలేదు. ఇంతవరకు దాచితిని గాని, యికదాచలేక పోవుచున్నాను. చూడూ!

సీ మాటలాడక నేను మౌనమూనిన గాని
యేమొ పలుకరించు నేమిసేతు?
పైదొలంగుచు నేను ప్రక్కకేగిన గాని
యేమొ పనులు చెప్పు నేమిసేతు?
ఆకలి లేదని సాకు చెప్పిన గాని
యేమొ తినగబెట్టు నేమిసేతు?
తెలియనట్టులు నేను తొలగియున్నను గాని
యేమొ చిన్నెలు చూపు నేమిసేతు?

గీ. భీతిచెంది నేను రోతచూపిన గాని
యేమొ పైకివచ్చు నేమిసేతు?
యింటికరుగనేను యెంతచూచినగాని
యేమివలను పడ దికేమిసేయ?

పద్మ—చంద్రా! ఇపుడు నిజముచెప్పితివి. నీకు కర్తవ్యము నేను చెప్పుదునుగాని, ముందు నాకొకమాట చెప్పుము.

చంద్రుడు—ఏమది ?

పద్మ—ఏమందువా ?

గీ. తారచర్యలునీకు నర్థంబునయ్యె;
పదును కత్తుల బోనులో పడితివీవు;
రోతచెందవలెన ? తార, ప్రీతిచెంద
వలెన ? నినుచూచి, చెప్పు-దాపరికమేల ?

చంద్రు—ప్రీతిచెందుట ప్రమాదహేతువేగదా ? రోతచెందిననే నాకు రక్షణీయము.

పద్మ—ఆడదానికి మగవానిపై రోతగలుగు మార్గమేదియో తెలియునా?

చంద్రు—తెలిసియుండిన నిన్నడుగుదునా ?

పద్మ—తాను ప్రేమించిన పురుషుడు తనకంటె మరొక మగువను ప్రేమించటం, ఆమెతోకలిసి ఆడటం - పాడటం, కళ్లార చూచినచో ఆడదాని మనసు అసహ్యపడగలదు.

చంద్రు—అంటే ?

పద్మ—అంటేనా? నీవు నన్ను ప్రేమించినట్లు నటించు; అదిచూచి తార "ఛీ" అనుకొన గలదు.

చంద్రు—నిన్ను ప్రేమించటమా ? తారను తప్పించుకొన్న నీవా, నిన్ను కాదనిన తారయొ మొత్తముమీద నాకీ బెడద తప్పదా ?

పద్మ—తప్పుటకే యిదొక తంతు. నిన్ను తనవాడిని చేసుకొనటానికామె చేయుతంతులు చూస్తున్నావుగదా ? ఆమెను దూరము చేసుకొనటానికి నీవీ తంతుచెయ్యాలి. అంతే.

చంద్రు—నాకది చేతకాదు గదా ?

పద్మ—నీ కేది చేతనయినది చంద్రా !

చంద్రు—మరేమిచేయుదును ?

పద్మ—నేను చెప్పినటులు చేయుము. నేను ఆడుతాను, నాతోకలిసియాడు— నేను పాడుతాను, నాతోకలిసి పాడు.

చంద్రు—అమ్మయ్యో! తారాదేవి చూస్తే?

పద్మ—విరక్తి చెందుతుంది. ఆమె చూడాలనేగా!

చంద్రు—విరక్తే చెందుతుందో? విరోధమే పూనుతుందో?

పద్మ—ఏమయినా భయంలేదు.

చంద్రు—సరె. పాటపాడుకొనుచు అటు పోదాం పద.

(పాటపాడుకొంటు నిష్క్రమింతురు.)

(రెండవవైపునుండి రక్తి, ముక్తి, తారలు ప్రవేశింతురు.)

రక్తి—అమ్మా! మా మాట నమ్మేవుకావు. చూడు!

ముక్తి—అబద్ధం చెప్పటానికి మాకేం పనమ్మా!

రక్తి—మామీద నిష్ఠూరమెందుకు? మీరే చూస్తే యే గొడవా వుండదు.

తార—వటువులారా! ఈ పద్మాచంద్రుల ప్రవర్తన మీ రెపుడు చూచితిరి?

ముక్తి—ఇప్పుడేనమ్మా! అలా చూచాం— యిలా చెప్పాం.

రక్తి—ఎప్పుడో చూస్తే మా నోట్లో దాగుతుందా తల్లీ?

తార—వీరెంత కాలంనుండి యిలా ప్రవర్తిస్తున్నారు?

రక్తి—ఆ విషయం మాకు తెలియదమ్మా!

ముక్తి—ఇంకా, తెలిస్తే మీకు తెలియాలి.

తార—పోనీ, మీ గురుచంద్రుల వారికి తెలియునా?

ముక్తి—పాపం. బృహస్పతి భగవానుల వారికీ చిదంబర రహస్యాలన్నీ పట్టినవా తల్లీ? వారి తపమేమిటో? వారి జపమేమిటో? వారి స్నానం— సంధ్యా. అంతే.

తార—నిజం. నిజం. వటువులారా!

చ. గురుమహాదేవు లీ యితర గోష్ఠి నెరుంగరు సర్వవేళలన్
పరమ తపోవిధానముల వర్తిలు టంతియగాక, చంద్రు నీ
పరిసరవర్తనల్ గనుచు వారు చరింతురె? అట్టి పుణ్యుడా
సురగురుమూర్తి యాశ్రమము చోద్యముగా నిటులౌట నొప్పునే?

ఆహా! ఎంత అవివేకము ?— ఎంత సాహసము ?

ము_క్త—అది కాదమ్మా! ఐతేమటుకు పద్మ యేమిటి ? చంద్రునితో యీ పాపమేమిటి ?

తార—ఐతే ర_క్తేశ్వరా! పద్మ చేయుచున్న పని తప్పంటావా ?

ము_క్త—తప్పుకాదా తల్లీ! పట్టపగలు— పరపురుషునితో—

తార—వటూ_త్తమా! పద్మగూడ తగు యు_క్తప్రాయురాలుగదా ? వివాహముగాని వెలంది యైనపుడు యిట్టి కోరిక లుండటం పాపమా ?

ర_క్త—అబ్బే. ఆ మాట యెలా అంటాం తల్లీ!

ము_క్త—అది ప్రకృతి ధర్మం— దేహధర్మం కూడను.

ర_క్త—దేహధర్మము నరికట్టటం మాత్రం ధర్మమా తల్లీ!

తార—ఔను. మీ మాటలు యదార్థములు.

ఉ. నీతులు బల్కినంత, చనునే ఋతుధర్మము—దేహధర్మముల్ ?
నాతులుగూడ మానవులనన్ దగరే ? మమకార మొందరే ?
ఖ్యాతియటంచు; పాపమని కట్టుకథల్ పదివేలు చెప్పినన్
ప్రీతి జనించునా సతికి వేమరు నాధుని పొందులేనిచోన్.

(తనలో) మఱొక విధమున విచారించి చూచినచో నాకంటె యీ పద్మయే ధన్యురాలు గదా ?

సీ. పెండిలయిన దాన విభుడుండెనే కాని;
కామసుఖంబుల కలదు నా_స్తి;
గురుపత్నినే నన్న గొప్పయొక్కటె గాని;
మనసులోని వ్యధలు మాన వెపుడు;
శీలమాచారముల్ చెదర వంతియెగాని:
హృదయంబు కల్మష మెపుడొ యయ్యె;
సంఘ దండనటన్న జంకియుంటయె కాని;
నిజమైన పతిభక్తి నెలమి సున్న;

గీ. మాటి మాటికి చెదరెడు మనసునెట్లొ
కూర్చి బలవంతమున పట్టు కొనుచె గాని;
కల్ల బొల్లి, కలతలేని యుల్లమందు
స్థాయి యన్నది లేదు నా జన్మ కింక.

ఒకవేళ ప్రామాదిక మాపాదించి, చంద్రుండు నాకోరిక నెరింగి మదనక్రీడల సుఖపెట్టుననియే అనుకొందును. అదిపాపము కాదా? నాపతికి నేను ద్రోహము చేసిన దానను కానా? నాసౌశీలమును నాశనము చేసుకొనిన కులటనుగానా? ఇంత దనుక గురుమహాదేవులు బృహస్పతి భగవానుల వారి ధర్మ పత్నినై——మహాపతివ్రతా శిరోమణినై - అశేషప్రజాసమూహంబులచే కొనియాడబడుచున్న నేను పతితనై - లోకనిందాపాత్రనై - పుత్రసమానుండైన చంద్రునినైతము నతఃపతనము పాలుజేసిన మహాపాతకినై - భర్తృ శాపంబునకు బాధ్యురాలను కాకుందునా?

రక్తి—అమ్మా! తారాదేవిగారూ ఏమి టాలోచిస్తున్నారు?

తార—(స్పృహను దెచ్చుకొని) ఆఁ! ఏమియును లేదు. రక్తేశ్వరా! పద్మాచంద్రుల నెట్లు దండింపవలయునా యని యోచించుచున్నాను. ముక్తేశ్వరా! మీరిరువురు వారిని పిలిచి నా వైపు చూచునట్లుచేయుడు,

రక్తి, ముక్తి—చిత్త మాలాగేనమ్మా!

(ఇరువురు పద్మాచంద్రులను సమీపింతురు.)

ముక్తి—చంద్రా! చంద్రా!

రక్తి—పద్మా! పద్మా!

ముక్తి—ఎంతపిలిచినను మన మాటలను వినిపించుకొనటంలేదమ్మా!

రక్తి—ఏమిచెయ్యమంటారమ్మా!

తార—(బిగ్గరగ) పద్మా! పద్మా!

పద్మ—(చూచి) మీరా! తారాదేవిగారా?

తార—ఔను నేనే.

చ. ఇది ముని యాశ్రమంబుగద ? ఏమివిలాసము, లేమిక్రీడ లీ
మదన వినోదకేళికల మాన్యులు మెత్తురటే ? మహా యఘం
బొదవదటే ? గురుండుగన బూది యొనర్పడటే ? మదంబునన్
సదమల భారతాంగనకు శాశ్వతమౌ యపకీర్తి కాదటే ?

గీ అమ్మ-గురుపత్ని-తారయేమనునొాయన్న
చింతలేక; మదినొకింత సిగ్గులేక;
కులుకుచుంటివి-శీలంబు కలుషమయ్యె
సైపజాలను నిన్నింక క్షణమునైన.

పద్మ—తారాదేవిగారూ ! తరువాత మనవి చేయుదును గాని, ముందీవటువుల నావలకు సాగనంపండి.

తార—వటువులారా ! మీరీ చంద్రుని యాశ్రమంబులోనికి గొనిపొండు. నేనును వచ్చుచున్నాను.

రక్తి, ముక్తి—చంద్రా ! రావయ్యాపోదాం. (ముగ్గురు నిష్క్రమింతురు)

తార—పద్మా !

పద్మ—అమ్మా !

తార—ఏమిటి ?

పద్మ—నీకు తెలియని దేమున్నదమ్మా !

గీ. భర్తగల సతివీ; వవివాహి నేను;
నీకె చంద్రునిపై భ్రాంతి నిలిచియున్న
నాకు మమకారముండ నన్యాయమగునె ?
బాగుగాధర్మమెంచి యేపలుకు మమ్మ !

తార—(చిరాకుతో) పద్మా ! చాలించునీ మాటలు.

ఉ. కామముచేత చందురుని కౌగిలి గోరిన నీ చురాల !నీ
కేమయినన్ మదంబు ఘటియించెనె ?చేసిన తప్పుచాలదే ?
యీా మెయి నన్నుగూడ చరియించిన దానను వేయబల్కు నీ
ధీమసమేమి ? చాలునిక తిట్టెద-కొట్టెద-కాళ్ల మట్టెదన్.

పద్మ——అమ్మా తారాదేవీ! నాపై బోకరించిన లాభములేదు. చేసిన దోషము త్రోసివేసినను, దూసివేసినను పోవునదికాదు. నీ కీవిషయం బున నెంతదనుక ప్రవేశమున్నదో నాకు తెలియ దనుకొంటివా?

ఉ. మాటికి మాటికిన్ మనసుమారుట, అంతటబుద్ధిలోన "ఛీ!
యేటికటంచు తెంపును వహించుట; వెండియు చంద్రుడన్న మో
మోటము పెచ్చు మీరుట; ప్రఫుల్లమనంబున తెప్పరిల్లుటల్
గాటును దిన్నదెందమది గన్పడుచున్నది చెప్పనేటికిన్?

తార——పద్మా! ఇక నా హృదయమును దాచలేక పోవుచున్నాను. ఇటురా! నామానోవ్యధ నీకెటులు బోధపడినదే?

పద్మ——తెలియదటమ్మా!

సీ. చంద్రునిదేహంబు స్వస్థతలేదన్న
కళలు దప్పెడు నీమొగంబుతీరు;
ఆతండు నొకపూట నన్నంబుదినకున్న
కన్నుమూయని నీ మొగంబుతీరు;
పలుమారు నీతోడ పల్కాలాడకనున్న
కలతనొందెడు నీ మొగంబుతీరు;
పల్లెత్తుమాట నెవ్వారలే మనుకొన్న
కడిమిచింతిలు నీ మొగంబుతీరు;

గీ. చెప్పుచుండంగ నీ వింక చెప్పనేల?
చీరెగట్టిన - పూల నీ సిరమునిడిన
చంద్రుడేల? మేమెల్లయు చాలకేమి?
మరుగు బెట్టగనేల - నీ మదనబాధ.

తార——నాలోయింత బేలతనమున్నదటే? నేను నీకంటికింత తేలికగ పట్టుబడితినటే? నా హృదయకాంక్ష నిగూఢ మనుకొన్నాను—పద్మా! మనోవాంఛలు వికసించినపు డా చంద్రుడు నామనో గతంబును గమ నించలేక పోయినందులకు విసుగుకొనుచున్నాను—వేదన పడుతున్నాను. కాని, ఆ సమయం గడిచిపోయిన తరువాత "అమ్మయ్య! నా యత్న

మతడు గ్రహింపలేదు - నా సౌశీలము భంగపడలేదు-నే నా పాపఁ
నేయలేదని సంతసించు చున్నాను. నీవనినట్లు........

చ. కలతనెరుంగఁబోని; నిజకాయమదేటికొ మాటి మాటికిన్
కలవరమందు-నంతటనె గగ్గురుపాటు జనించు; నిక్కమే
చెలగి దలంచు పట్టునను సిగ్గగు; ఛీ యనుకొందుగాని నా
కలవియు గాకపో యెగద కామునిబాధ దొలంగనెచ్చెలీ!

అందులకు నేనేమి చేయుదునే?

గీ. ముసలివాని కర్ధాంగినౌ వ్యసనమొండు;
చంద్రుదేల నన్గనడన్న శంకరెండు;
పరులపొందు పాపమనెడు భయము మూడు
మానకున్నవి, పద్మ! నా మనసులోన.

అకటా! నా బ్రతుకెట్టి పతనంబునకు మూలము కానున్నదోగదా?

సీ. అక్కట! మానినినై; బుట్టగానేల?
పురిటిలో చావకపోతినేల?
పెండిలాడఁగనే ప్రీతినొందితినేల?
ముసలి మునిసతిగా మసలనేల?
చదువునేర్వగవచ్చు చంద్రుగోరితినేల?
మజల నాకోరిక మరువనేల?
అతడైన నావాంఛ ననుసరింపడదేల?
అంతలో భీతి నా కమరనేల?

గీ. చేరియొకరీతి ధైర్యంబుచెందనేల?
కుదురుబాటు నా మనమున కొదవదేల?
చింతయేల? యీగతి మనో ఒకులేల?
తాళజాల! బాలా! యీమదనుని లీల?

పద్మ—అమ్మా! చంద్రుడు నీ వాలకమును గమనింపలేదని విచార
మందు చుంటివా? కాదు— కాదు. ఆతడు నీ మనోభిప్రాయమును
సర్వమెరింగిమే యున్నాడు.

తార— (ఆతురతతో) ఆ! ఆ! చంద్రుడు నా మనోగతంబు నెరింగెనా? నా చంద్రుడు— నా ప్రణయసాంద్రుడు— నా.... నా.... నా....

పద్మ—తారాదేవీ! అతనికి నీ యభిప్రాయము బాగుగ తెలియుటచేతనే, తెలియనట్లు— తెలిసీ తెలియనట్లు— తెలియక తొలిగినట్లు మెలగుచున్నాడు.

తార—తెలిసియే తెలియనట్లు తొలిగి తిరుగుచున్నాడా? పద్మా! నిద్దుర పోవువారిని మేల్కొలుపగలము గాని— మేల్కొనియే పలుక నొల్లని వారిని పిలిచియేమి లాభము?— కొలిచియేమి లాభము?

మ. అకటా! చంద్రుడు మన్మనోగతము గ్రాహ్యంబైన గానీ, యతం
డొక నాడేనియు నోరువిప్పి ప్రణయం బొప్పార "తారా! సఖీ!
యిదె యాలింగన మంచునన్ గదియ రాడేమీ కతంబింక- నే
నెకిసక్కెంబుల నాడుచోట పెడమొగంబై జూపు పంతంబునన్.

పద్మా! చంద్రుడు నా యందింత విముఖత్వము చూపుటకేమి కారణమో చెప్పరాదటే?

పద్మ—నాకు మాత్రమేమి తెలియునమ్మా! నీవే యోచించి చూడుము.

తార—(ఆలోచనతో) నేను రూపవంతురాలను గానా?

పద్మ—ఎవరన గలరు? అప్సరసలకన్న నందమైన దానవు?

తార—మఱి, వాక్చాతుర్యములేని దాననా?

పద్మ—అదేమి మాట? సరస్వతిని మించిన దానవు.

తార—కాక, యవ్వన ప్రాయురాలను కానా?

పద్మ—కాదన్న వారికి కన్నులు లేక పోవలయును.

తార—పోనీ, నా లోప మేదియో చెప్పరాదా?

పద్మ—నీ లోపమా? గురు పత్ని వగుట—గురు పత్ని తల్లితో సమానమగుట. అంతియే లోపము.

తార—ఆ లోపము తీరున దెప్పుడు?

పద్మ—నిజ పత్నివగు నప్పుడు.

తార—ఆభాగ్యము చేకూరిన గదా ?

పద్మ—చేయదగిన పని చేయ గల్గినచో చేకూరకపోవునా ?

తార—అదెటులే ?

పద్మ—అమ్మా! ఇపుడు నేను మీకు శిష్యురాలను—చంద్రుడు నీకు శిష్యుడు. ఇకమీద వాని గురువు గురుమహాదేవులవారు కారు — మీరే. అప్పుడు చంద్రుడు — వినయ గుణసాంద్రుడై, "గురుమహారాణీ! ఈ శిష్యుడు మీరు కోరిన దానిని గురుదక్షిణగ సమర్పించుకొనగల"దని చెప్పగలడు

తార —, (నవ్వి) అబ్బ! నీ పరిహాసములు కట్టిపెట్టి, కార్యసాధనాలోచనకురావే.

పద్మ—నన్నుకాదమ్మా పిలువదగినది—చంద్రుని ....

తార—అదెటులు ?

పద్మ—బలాత్కారముగ.

తార—ఐన........

పద్మ—సందేహములేదు. అమ్మా!

ఉ. ఇంతులు మిన్ను కున్నపుడె యీమగవారల పీతిగావి, ర
వ్వాంతవలంచి, మించి ప్రణయంబును చూపిన నింతలోన నే
స్వాంతము సంచలింపదె? నిజంబుగ నెంతటివావికైన, నా
కాంత సుఖంబులన్ బడయగా పరితాపము నొందకుందురే?

తార — పద్మా! అటులైన నీవు నాకు సాయపడవలయును సుమా!

పద్మ—అమ్మా! నేను కాదంటినా? నా శక్తికొలది సహాయము చేయుదును.

తార—నా కితర సహాయ మేమికావలయును! ఈ చంద్రునితో మదన క్రీడల దేలుటయే నా కోరిక. దానిని తీర్చుటకు కంకణమును గట్టుకొని నాకు సహాయముచేసిన నీ మేలు మరువను.

చ. పడుచుదనంబు నాది, మునివర్యుఁడు వృద్ధుడుగాన, కోరికల్
కడువడి చంపుకొంచు చిరకాలము బుచ్చితి నెట్టులెట్టులో
పడతి ! శశాంకుడన్న సరివచ్చెడు మన్మధరూపురేఖలం
జెడు మమకారభావముల జిత్తమునన్ గలుగంగ జేసెడిన్.

ఆలోచించి చూచిన యీ నేరము నాదికాదు. యుక్తాయుక్తము లెరుంగక యవ్వనప్రాయంబున నన్ను ముదుసలి కొసంగి పాణిగ్రహణంబు గావించిన నా తలిదండ్రుల దోషము— ఈ వివాహము న్యాయసమ్మతముగాదని నాడు వారింపక చూచుచు నంగీకరించిన సంఘ పెద్దల లోపము— "వయసుదప్పిన నాకే పడుచులపై యింత మమకార మున్న యీ కన్నియలకు తగు వరునితో సంసారము సేయవలయునను భ్రాంతియుండునుగదా" యని యోచింపక మెడలో పసుపుత్రాడు గట్టిన నా పెనిమిటి యమాయకతనము. అందులకు నేను శిక్ష ననుభవింపవలయునా ?

పద్మ—తల్లీ ! నాకావిషయము తెలియును. అందులకే నేను నీకు సహాయ మొనరింతునని వాగ్దాన మొసంగితిని.

తార—మరువవుగదా పద్మా !

పద్మ—నా కంఠమున ప్రాణములుండ మరువను.

తార—సఖీ ! అటులైన నిక బోవుదము రమ్మా.

(ఇరువురు నిష్క్రమింతురు.)



ఓమ్

# తా రా శ శాం క ము

## తృ తీ యాం క ము

### మొ ద టి రం గ ము

(బృహస్పతి యాశ్రమమున, తార ప్రవేశము.)

తార—ఆహా!

మ. బలవంతంబున చంద్రునిన్ మరువ లోభావించి యత్నించి; ని
ర్మలదీక్షన్గని యున్నగాని, యతడే రానేల? చిత్తంబులో
కలతల్ బెంచగనేల? నన్ పతితగా గావింపగానేల? దు
ర్బల తత్వంబిటు నామనంబునకు సంప్రాప్తింపగా నేలకో?

ఏమీ? చంద్రుని ప్రేమించుచున్నానా? నా యధోగతిని నేను నిర్మించుకొనుచున్నానా? లేదు-లేదు. చంద్రుడు మాయింటి విద్యార్థి; ప్రశాంతమూర్తి— పరకాంతా విముఖపరాయణుడు— గురుభక్తి తత్పరుడు. వాడు—చంద్రుడు. హృదయమా! నీవింక నా చంద్రుని పేరెత్తకుము. మోహమా! నీవు నన్నపమార్గంబునకు త్రిప్పకుము. దేహమా! బృహస్పతీ భగవానులవారి కర్పితమైతివి— యీ యెంగిలి కూడు నా చంద్రున కేల రుచిచూపెదవు? నీ వపవిత్రమేల నయ్యెదవు? చంద్రుని జీవితమేల పాడొనరింతువు? మరచిపో. చంద్రునకు నీవు మాతృసమానురాలవను మాటమాత్రము గురుతుంచుకో. నీ వెపుడో గురుదేవులవారి సొత్తువై పోతివి. తిరిగి స్వతంత్రించుటకు నీ వెవరవు?

ఉ. మచ్చునకేని, దోషమనుమాట నెరుంగడు; యింతచేసినన్
కచ్చియనొందబోడు, సరిగా తలయెత్తియు చూడ డిట్టి యీ
సచ్చరితుండు, చంద్రుడు; ప్రశస్తకరుండగు వీని-నేనె, బల్
మచ్చరబుద్ధినొంట, నపమార్గమునన్ నడిపింప జూచితిన్.

హా! హా! ధన్యురాలను. నా జీవిత రహస్యం నా కర్థమైనది. నా మనోవైకల్యం నేను తెలుసుకొన్నాను. నేను దుమూకబోయే మహా

పాతక పారావారమునుండి తొలిగి చరించినాను. అమ్మయ్య ! నే నప విత్రను కాలేదు-కామపిశాచికి నా జీవితము బలికాలేదు—ఈయరిషడ్గుణ సమన్వితానేక యింద్రియవాంఛలకు చిక్కువడలేదు - నా భర్తకు కళంకమును గావింపలేదు- ధన్యురాలను-

(బృహస్పతి ప్రవేశము)

తార—(బృహస్పతిని చూచియు చూడనటులు నటించి) గురుదేవులు-త్రిశత్కోటి బృందారకాబృంద వందనార్చిత చరణారవిందులు-బృహస్పతి భగవానులవారి కర్థాంగలక్ష్మినగు నేను ధన్మురాలను - కడు ధన్యురాలను- కడుంగడు ధన్యురాలను. (బృహస్పతిని చూచి, లేచి, భక్తితో నమస్కరించి) ప్రాణేశ్వరుల కళివాదములు.

బృహ—మనోవాంఛా ఫలసిద్ధిరస్తు. కల్యాణీ ! నీ చిత్తం బెల్లప్పుడు భర్తృసేవాసంకల్పమునందే నిలిచియుండును గదా !

తార—భార్యకు కావలసినది భర్తృసేవయేగదా నాథా !

బృహ—చాల సంతోషము. ప్రేయసీ !

ఉ. జన్నము సేయగా దలచి సర్వసురాధివిభుండు వేగమే
నన్నటు రమ్మటంచిపుడె నాకు విమానము నంపెగాన, నే
గ్రన్నర బోయివత్తు, నిట కాదగుకార్యము లేమొ పూవి నీ
వన్నియు పూర్తిచేయదగు నంగన ! నేనిలు సేరు లోపునన్.

తార—నాథా ! మీరు దేవలోకమునకు బోయివత్తురా ?

బృహ—ఔను.

తార—మరి నేనును రాకూడదా ?

బృహ—కూడదను మాటకేమిగాని, మన మిరువురము స్వర్గమునకుం బోయినచో యిందు మన యాశ్రమంబు నెవరు చూతురు ? వటువు లంద రేమగుదురు ? అందును చంద్రుడు....

మ. సుకుమారుండ ననూయకుం బ్రియసుతుం డవ్వాడు చంద్రుండు వా
నికి సౌఖ్యంబిట గల్గుబెట్టు లతివా! నీవైన లేకున్న-బో
వక నాకున్ మరి.దప్ప దీ పనియు; నీవై యింటి కార్యంబు తె
ల్లకడుం దీర్పుము చంద్రుడొప్పు నిక బాలా! నీ కుమారుండునై.

తార—(మనంబున భయమందుచు తనలో) పాపము శాంతించునుగాక - పాపము శాంతించునుగాక. అమోఘవచనాశీలుండగు నీ మహానుభావుం డిట్లను చుండెనేమి? "చంద్రుడొప్పు నిక బాలా! నీ కు-మారుండునై" అనియా! కాదు-కాదు. వారి భావము "నీ-కుమారుండునై" అని గావచ్చును.

బృహ—తారా! ఏమియో తీవ్రముగ నాలోచించుచున్నావు?

తార—లేదు గురుదేవా! నా మనంబున స్వర్గావలోక నాభిలాష మిక్కుటంబగుచున్నది. మహాయాగ విధానంబునుగూడ చూడ వాంఛించుచున్నాను. నా ప్రార్థన లాలించి నన్నుం గొనిపొండు.

గీ. చూడ వేడుక య్యె నా చోద్యమెల్ల
.తమదు పాదములంటి ప్రార్థనలు నేతు,
కాదటంచు వారింపక కరుణతోడ
వెంట గొనిపొమ్ము నాథ: ఆటంకమేల?

తారా—అందు నీవంటి సాధ్వీలలామలు చూడదగిన దేదియును లేదు. స్వర్గమనునది పేరునకు మాత్రమేగాని దుర్గుణంబు లన్నియు నందే యున్నవి తారా!

సీ. మత్తుద్రవమునైన మధుపానమును నేయు
దుర్వ్యసనంబుల దొడ్డభూమి:
రంభాది వేశ్యల రతికేళికలతోడ
పాప కృత్యంబుల పైడిగడ్డ;
యజ్ఞ యాగంబుల నశ్వాది జీవుల
చంపి, భుజించు మాంసంపు కూడు;
.పెద్దలై దనుజ వీరుల వదలించి
స్వర్గమేలు కొనెదు స్వార్థబుద్ధి;

గీ. కలవు దేవులలోన నిక్కంబుగాను;
మాటలందు-పౌరాణిక బాటలందు,
మంచి తనము గన్పడుగాని, మచ్చుకైన
వర్తనమున ధర్మంబు గన్పడగరాదు.

తార—ఐన నేనిందుండ వలసినదేనా ?

బృహ—ఉండకున్న నెటులు తారా ?

తార—ఎందులకో నేడు మాత్రము మిమ్ము విడిచియుండ నామనం బొప్పకున్నది నాథా ! ఈకోరికను మన్నింప వలయును.

బృహ—తారా ! అంతగ కోరితివి గాన, మరొకమారు తప్పక నీ కోరిక దీర్చెదను. ఇప్పటికి మాత్రము........

తార—కాదు గురుదేవా !

శా. మీ యానన్ జవదాట దెప్పుడయినన్ మీ దాసి వేడ్కలు నా
ప్యాయం బొప్పగ నాదరింపవలె నా ప్రాణేశ్వరా ! మీరు లే
నీ యుద్యాన నివాసమన్న మదిలో నేమో భయంబయ్యె; దే
వా ! యేతెంచెదు లోపు నేది యెటులై వర్తించునో చింతగున్.

బృ—దేవీ ! అధైర్య పడకుము. నా యాశీర్వచన ప్రభావంబున నీ తలంచిన కార్యంబు సఫలంబగు గాక.

గీ. ఇప్పటికె జాలమయ్యెనే నేగవలయు
మాతలడుగొ కూర్చుండె విమానమందు
నాకలోకంబున. విబుధ నాయకుండు
నెదురు తెన్నులు చూడడే యిందువదన !

తార—ఇక మీ యాన

బృహ—నే బోయివచ్చెద. (నిష్క్రమించును.)

తార—(తనలో) ఆహా ! విధివిలాసమెటులు కానున్నదోగదా ? (ఎదుట చూచి) ఎవరావచ్చువది ? పద్మయా ?

(పద్మ ప్రవేశము.)

పద్మ—అమ్మా ! తారాదేవీ ! గురుభగవానులవారు స్వర్గమునకు బోయి రట. నిజమేనా ?

తార—నిజమే.

పద్మ—ఐన, నేడు చంద్రుని....

తార—పద్మా ! ఇంక నా మాటలు చెప్పకే.

చ. తెలియక తప్పుకార్యమున; తెంపు యొనర్పదలంచి యేమియో
పలికితి జ్ఞానశూన్యమున, పాపము నేయనటంచు నిష్ఠ ని
శ్చలత వహించియుంటి, యికచంద్రుని గింద్రునివంక జూడ, కే
కలుషిత మింతలేక, కలకాలము కీర్తిగడింతు త్యాగినై.

పద్మ—దానికేమి తల్లీ ! నీకట్టి నిర్మలచిత్తంబు ఫలింపవలయునేకాని కాదనువారుండిరా ? ఇక నీకా చంద్రునిపై మక్కువ లేనటులేగదా ?

తార—ముమ్మాటికిని.

పద్మ—అటులైన.

ఉ. చక్కనివాడు; చంద్రుడన జవ్వన ప్రాయమువాడు; చూడగా
మక్కువగూర్చువాడు; తగుమాటల వానికి జంటలేనిచో
చిక్కినకాంత లెవ్వెరో, స్పృశింపగమానరు-కాని, నీకునై
యక్కరలేని పండెవరి హస్తములన్ బడినన్ విచారమే ?

తార—ఆఁ ! ఆ ! పద్మా ! ఏమంటివి ? నా చంద్రుని మరొక్క కాంత స్పృశించుటయా ? అందున్గురించి నాకు విచారము లేకపోవుటయా! సహింపను - నా చంద్రుని నేను విడువను.

పద్మ—(నవ్వి) ఐన, నీకు చంద్రుడు కావలయునా ?

తార—అబ్బా ! నా కేమియు దోచుట లేదే ?

గీ. మావి ఫలమారగింపగా మమత గలదు;
అంత యుష్ణమటన్న భయంబునయ్యె;

"అనుభవింపక విడువ నేమగునో" నన్న
చింత బాధించుచుండె నా చిత్తమందు.

ధర్మమును పరిత్యజింపలేకున్నానే, పద్మా !

పద్మ—ధర్మ మనగనేమి ?

తార—సంఘము నియమించినది ధర్మము.

పద్మ—పిచ్చితల్లీ ! ఇంకను సంఘమని, సంఘ నియమమని, సంఘ నియమములే ధర్మము లనుచుంటివా ? ఎది సంఘం ? ఏది సంఘ నియమం ? ఏది సంఘనియమ ధర్మం ? డెబ్బదేడుల ముసలి ముని తాత యిరువదేడుల పడుచుల పెండ్లి లాడుట ధర్మమా ? సనాతనా చారము లను సాకుతో నీ వంటి నవయవన లావణ్యవతిని పతి సుఖంబు లకు దూరము చేయుట ధర్మమా ? ఆడుదాని హృదయంబులం దుద యించు మనోహరభావంబులందే క్రుంగి, కృశించ వలయునని- వారు మానవరూపంబున దిరుగు యంత్రముల బోలినారని, తలంచి- నిర్ణయించి- శాశించుటయే ధర్మమా ? ఇంత పక్షపాత సమన్వయమై- నిర్దాక్షిణ్యకరమై- సాటి మహిళామణుల నమానుషముగ శాశించునది సంఘమా ? సంఘీయుల కసభ్యతను గలిగించు శాస్త్రసిద్ధాంతము సంఘ నియమమా ? సృష్టిక్రమంబును మరుగుపరచి- సంసారసౌఖ్య మును సన్యసించు - బలాత్కార మనోనిర్బంధన సంఘనియమ ధర్మమా ? తారాదేవీ ! మేలుకో. ఈశారీరము ప్రాపంచ భోగములకై నుదయించినది. ఏ తరుణంబున నొందదగిన యానంద మా కాలంబున ననుభవించుటయే ఋతుధర్మము-లోకధర్మము-దేహధర్మము.

తార—ఆహా ! పద్మా ! ఎంత లౌకికవ్యవహార సారాంశమును బోధించి తివే ? నాలో యిపుడు నవచైతన్య మంకురించినది-మహానంద నవ యుగ మారంభముకామన్నది. అశాశ్వతమైన శరీరం, అతిమధుర భావాలతో నానంద మనుభవించినదే యుత్తమము. పద్మా ! పద్మా ! ఏడే, నా చంద్రుడు ?

పద్మ—చంద్రు డిటు వచ్చునటులు నేను చేయుదునమ్మా !

తార—కాని, ఏ మయినా, సరే, యీసారి సాహసం చేస్తాను. ఏలాగైనా చంద్రుని నా వానిని చేసుకొంటాను. మరపురాని మన్మధ కేళీ విలాస తరంగాలలో తేలిపోతాను.

పద్మ—అలాగే సాహసించు. వస్తాను.

(నిష్క్రమించును.)

తార—ఆహా నేడుగదా. నా చిరకాల మనోరథంబు నేకూరనున్నది నేడుగదా ? చంద్రాలింగ నానంద మనుభవింప నుంటిని ?

గీ. దైవ నిర్మిత శారీర ధర్మ మిదియ
దానిమించిన కల్పిత ధర్మమేల ?
స్త్రీ పురుష సంగమం బింత చెనటిదైన
సృష్టి ధర్మమీచందాన చెలగు చేల ?

(చంద్రుడు ప్రవేశము.)

చంద్రు—ఎవరు నన్ను పిలిచినది ?

తార—నేనే.

చంద్రు—మీరా ?

తార---ఔను. నేనే.

చంద్రు---ఎందుకు పిలిచినారు ?

తార--నీతో....

చంద్రు--పని యున్నదా ?

తార--పనిలేకయే నిన్ను పిలిపింతునా ? అది సరికాని, యింత ప్రొద్దు పోయినను భోజనమునకు రాకుంటివేమి ?

చంద్రు--గురుదేవులవారు చెప్పిన పాఠము వల్లించుచున్నాను.

తార-- మీ గురువుగారు ప్రస్తుతము యింటలేరు. తెలియునా ?

చంద్రు--తెలియును.

తార--ఇప్పు డీ యాశ్రమంబున కధికార మెవ్వరిది ?

చంద్రు--మీది.

తార--ఇపుడు నీవు నేను చెప్పినట్లు చేయవలయును సుమా!

చంద్రు--ఔను,

తార--ఫలహారమునకు పిలిచితిని. ముందు తీసుకొనుము.

చంద్రు--నా కిపు డాకలి లేదమ్మా!

తార--నేను చెప్పినట్లు నీవు చేసితీరవలయును. ఫలహారము చేయుదువా? లేదా?

చంద్రు--ఇదియేమి యన్యాయమమ్మా! ఆకలిలేని యాహారము మీదనా మీ యధికారము?

తార--పోనీ, కాసిని పాలయినను త్రాగిపొమ్ము.

చంద్రు--చిత్తము.

తార--ఇంద-(పాల గ్లాసును చూపి) పుచ్చుకో.

చంద్ర--(చెయిచాచి) ఇలా అందించు తల్లీ!

తార--నీకు ప్రాలు త్రాగటంగూడా తెలియునేమి? చాలు చాలు నేనే త్రావించెదను. యిటు రమ్ము.

చంద్రు—(సందేహించుచుండును.)

తార—ఏమినేను త్రాగించరాదా? పరాయిదాననా?

చంద్రు—కాదు, గురుపత్నివి.

తార—ఇంతవరకు గురుపత్నినేకాని—యిపుడు నీకు నిజపత్నిని. చంద్రా! రా! ఇంక నేనీ మదనవేదన భరింపజాలను.

చంద్రు—(చెవులు మూసుకొని) హరిహరీ! పాపము శాంతించుగాక—పాపము శాంతించునుగాక.

శా. లేరే లోకమునందు శిష్యజనులన్; లెక్కింపగా నెందరో
నీ, రీతిన్ గురుపత్నులిట్లుగలిగున్ నీతిప్రధానంబుగా,
మీరల్ వింటిరే? చెప్పుమమ్మ! మనలన్ మేలంబు లిట్లాడ దూ
ర్వారంబైన యఘంబు నేటికి గడింపన్ జూనితో మాతరో!

తార—చంద్రా : చాలింపుము నీ ధర్మశాస్త్రములు.

ఉ. నీతులు నామమాత్రములు; నిక్కముగావు; పురాణగాధ లీ
శ్రోతల మెప్పుకై బలుకు సూక్తులుమాత్రమె; గాని-చంద్ర ! ఈ
వ్రాతలువేరు—వారినిజవర్తనలున్ మరివేరులయ్యె నో
యీ !తరుణంబుపోయిన నికేమి సుఖింతువు మూఢనమ్మికన్.

చంద్రు—అకటా : కామభారంబున నేమనుచుంటిరి ? ధర్మశాస్త్రసమ్మతము లగు పురాణపుణ్యగాథలనే కల్పితములనుచుంటిరా ? నీతివచనంబులు చెప్పుటకేగాని చేయుటకు గాదనియా ?

చ. సరిసరి యేటిమాటలమ్మ ? బుధసమ్మత మార్గమటమ్మ ?నీతులన్
నిరసనజేసి వల్కుటకు నీ మనసొప్పునటమ్మ ? పెద్దలా
కరణి నభూతకల్పితపుగాథలు వ్రాయగనేటికమ్మ ? నీ
తెరగున సాహసింపగ ప్రతిష్ఠకు భంగముకాదటమ్మరో ?

తార—చంద్రా: పెద్దలనియు; ఆ పెద్దలు చెప్పినవి ధర్మములనియు వల్కితివి. నీ కాపెద్దల సుద్దులుతెలియవు కాబోలు. నాకుబాగుగాతెలియును. నీవునుగూడ తెలుసుకొని, తెలివిగల్గి; మసలుకొనుము.—

చ. పడుచుతనంబునందు. పరభామల గూడినవారె, వృద్ధులై,
తడబడి, నేడు, చేడియల పాపము మాన్పగలేని, బేల లీ
పడతుల గూడు వారిగని పట్టగరాని యసూయబుద్ధిచే
వెడగున నీతి గన్పరచి వేయివచించిన నమ్మకోసఖా !

మరియును.

గీ. దుర్బలురు, సర్వరోగులు, దుష్టసతుల
చేబడినవార లీరీతి చేతగాక;
కులపు కాంతల పెరవారు గూడు దురను
భీతిచెప్పు నీతులివియె పిచ్చివాడ !

ఆ మాయదారి మోసకారి మాటలకు గురియై లభించిన యవకాశము నేల జార విడుచుకొందువు ?

ఉ. కంటికి కానుపించి మరి కమ్మగ నోటికినందుపండు నే
దంటక, నెప్పుడో మరణమందిన పిమ్మట వచ్చునన్న దా
పంటకు నాసజెందుట దిపాడియె? నమ్మకమే? యిదేల-నీ
వంటి యమాయకుండు ధరవక్కరునుండునె పిచ్చిచంద్రుడా!

చంద్రు—తారా! నీవేమయినను చెప్పుము. నా మనంబు మాత్రమీ ఘోర కృత్యంబొనరింప సాహసింప కున్నది.

కం. పరవిత్తంబును గోరిన
పరదారను బొందుగోర పాపంబునగున్.
గురుపత్నివందు గావున
వెరువక నీదు సుఖమంద వెలదిరొనిజమున్.

తార—చంద్రా! నేను గురుపత్నిని కావుననే నామాట వినుమంటిని. నీ యందు నాకుండు మమకారమొకతీరు-వేరొకరికుండు యనురాగ మింకొకతీరు. కావున నామాట నిరసింపకుము.

గీ. నేను గురుపత్నినేయాట నీదుహితము
గోరుదాన; సుఖమునీకు గూర్చుదాన;
యేది యెనరించియైన నా వేదనంబు
దీర్చుటే నీదు ధర్మమో ధీరవర్య!

అదియునుంగాక.

గీ. అనుమతించితినేను; నాయానమీర
కుండ నాచరించిన బాలకుండ వీవు;
పాపకార్యమైనను, పుణ్యపథమునైన
ఫలము నాయది గాని, నీవంతుగాదు.

కావున నీకా పాప పుణ్యములతో పనిలేదు. నే నాజ్ఞాపించినది వర్తించుటయే నీ ధర్మము. నీ ధర్మము ననుసరించి చూచినను నీకు నీ గురువాక్య మవశ్యా చరణీయమేగదా? వారు సురనాధుని జూడ బోవుచు "చంద్రా! తార జెప్పినటుల మెలంగవలయునుజుమీ" అని నీకు దెలుపలేదా? అట్టియెడ నీకే సందేహమేల? అనవసర తర్క మీమాంశలేల?

గీ. నీవు పతితుడవైనచో నేను కులట ;
నేను కులటనైనచో నాదునేత లోటు ;
నేతలోపంబునకు సంఘనిర్ణయంబు
దోషమగుగాని, నీవు నిర్దోషివయ్య !

చంద్రు—హరి హరీ ! ఇదెక్కడి నిరర్థక ధర్మమమ్మా ! గురుపత్నివైనందులకు—శాసనాధికార సంపన్నవై నందుల కిదియేనా నీవు నాకు నుపదేశింప దగిన ముక్తిమార్గము ?

సీ. తప్పుచేయుదునేని తగుదండన మిడుటొ ?
క్రమశిక్షలేకున్న కసరుకొనుటొ ?
పనులు సేయకనున్న పట్టి శిక్షించుటొ ?
బద్ధకించిన పట్ల పగను గనుటొ ?
యిచ్ఛకమాడితినేవి దండించుటొ ?
పాఠాలు చదువని పందననుటొ ?
పరసొత్తు కాసింప పంతంబుబూనుటొ ?
పరుల హింసించిన పట్టుకొనుటొ ;

గీ. కాక మీయధికార మీ కరణి నన్ను
గురు సతీసంగ లౌల్యుని నెరపు కొనుట
కుపకరింతుపే-నాగొంతు కురియురాగ
వేయివంద నంబులు నన్నువిడువు మమ్మ !

తార—చంద్రా ! నీవేమొ రసికుడ ననుకొంటినిగాని—యింత నీరసింత వనుకొనలేదు. ధైర్యశాలివనుకొంటినిగాని—వట్టిపిరికి పందవనుకొన లేదు—నమ్మివచ్చిన నాతినానందమున దేల్చుమగ పుట్టువనుకొంటిని గాని — అందివచ్చిన అవకాశమును జార విడుచుకొను యాదు జన్మవనుకొనలేదు.

చంద్రు — పోసీ,యింతవరకు ననుకొన్నమాట లింకెందుకు ? ఇప్పుడే మను కొంటివి ?

తార—నీ వప్రయోజకుడ వనుకొంటిని.

చంద్రు—నిజముగ నీవటులనుకొన్న నానెత్తిపై పాలుపోసిన పుణ్యాత్మురాలవే యగుదువు.

తార—ఏల ?

చంద్రు—నా వలన ఫలములేదని పూర్తిగ విశ్వసించితివేని నాకింక నీ శయ్యామందిరమునుండి విముక్తుని ప్రసాదింతురుగాదా ?

తార—చంద్రా ! ఈ మాయోపాయంబున పారిపోచూచితివా యేమి ? అది నీవనుకొనినంత సులభముగ నెరవేరునది గాదయ్యా ! (అని చేయి పట్టుకొనబోవును.)

చంద్రు—(విదిలించుకొని. దూరముగ తొలగి) అమ్మా ?

తార—చంద్రా ! ఆడది వలచివచ్చినంతమాత్రమున నంతచులకనచేయ వచ్చునటయ్యా ? మగవానికిది మర్యాదయేనా ?

చంద్రు—కాదు-కాదు. చదువుకొనవచ్చిన బాలునకు మదనక్రీడలు నేర్పుట మర్యాద—ఫలహారములకను నెపంబున చేరబిలచి; పాణిని ముట్టచూచుట మర్యాద—నీతి, నియమంబులులేని, నీ కామపిశాచమునకు పరులను బలిచేయుట మర్యాద.

తార—ఆగు చంద్రా ! ఆగు. కామము నీతి నియమంబుల క్రమము దప్పుటకు కారణమేమి ? (కొంచెము నిదానించి) మాటాడవేమి. చంద్రా ! నీకు తెలియదు. సంసారి సానియగుటకు కారణములున్నవి?

సీ. తలిదండ్రులాదిగా తనవారు యోగ్యులై
క్రమశిక్షతో బెంచగలిగియున్న;
యిరుగు పొరుగు వారలెల్ల స్నేహితురాండ్రు
మంచి వర్తనలందు మసలుచున్న;
రసికుడైన విభుండు రమణి ముద్దులు దీర్చ
ననురాగ భావాల నలరుచున్న;
యిల్లాలెపుడు తనయిలుదాటి పరవారి
సాయ మపేక్షించి జనకనున్న;

గీ. పాపభీతిగనక; సత్యపథములేక
దొంగయై, కన్నవారికి లొంగిపోయి
జారిణీవృత్తి సేవించి సకియలెల్ల
తృప్తిగాంచక చనునె భర్తృసుఖమందు

కావున నా యీ పాటునకు మీ గురువుగారి యుపేక్షయే కారణము. నీవు మహాబుద్ధిశాలివి గావున మీ గురువుగారు తీర్చలేని లోటును నీవు దీర్చి కీర్తివంతుడవు గమ్మీ.

చంద్రు—(కనులు మూసికొని ఊర్ధ్వమునకుచూచుచు) హా! భగవానుడా! నా కెంతటి విపరీత పరిస్థితిని దెచ్చిపెట్టితివి స్వామీ!

తార—చంద్రా! (ఆలింగనము చేయును.)

చంద్రు—తారా! (విడిపించుకొన చూచును.)

తార—చంద్రా! (మరల నాలింగన చేయును.)

చంద్రు—(ఆనందమును పొంది) ఆహా ఏమి యానందము. ఈ భామా కౌగలియందింతటి హాయి యుండునని మున్నెన్నడు నెరుంగను కదా!

ఉ. అన్నులమిన్న, తార, హృదయంబును నా హృదయాన హత్తి; తా
కన్నులుమూసి, యొక్క పరిగాఢముగానను ముద్దులాడ ముం
దెన్నడులేని హాయిజనియించె, లతాంగుల బిగ్గకౌగి లం
దున్న సుఖంబులే ధరణినుండును? నిక్కమెంరుగ నెంతయున్.

తార—చంద్రా! ఇకనైనను నీ మంకుతనము పోయినదా?

ఉ. చక్కనిదాన; నిన్ను రతిసౌఖ్యములన్ మరిదేల్చుదాన; బల్
మక్కువ గూర్చుదాన, ననుమానమువీడి కరంబుతెమ్మి; నే
చక్కలిగింత బెట్టితిని, సారెకు, సారెకు నవ్వబోకు; నే
చిక్కితినోయి నీ కిదిగో చెక్కిలి నొక్కుచు ముద్దులాడవే?

చంద్రా! ఈ యానందము మున్నెన్నడయిన ననుభవించితివా?

చంద్రు—లేదమ్మా!

తార—అమ్మా! ఇంకను నన్నమ్మా యనుచుంటివా?

చంద్రు—మరేమనవలయును?

తార—"కొమ్మా" ! అనవలయును.
చంద్రు—ఏమి ?
తార—ఇపుడుమన మిర్వుర మెవ్వరము !
చంద్రు—మనమా ? మనము.... మనము తారాచంద్రులము.
తార—ఔనౌను. అనురాగ దంపతులము. చంద్రా !

గీ. ముసలిగురువుచెప్పు మృతకమంత్రములేల ?
నను భవింపు మిచట హాయినీవు;
నీవునేనుకలిసి.పూవు దీవెలయట్లు
పెనలు వేసికొంద మనయమింక.

చంద్రు—తారా ! నిజముగ నీయధర సుధామృత ధారలెంత మధురము గనున్నవి. ?

గీ. శుద్ధ ఛాందసుండనగుట; సుదతి భోగ
మెరుగకుండ, నీ చర్యల నెరుగనట్లు
మెలగి నీమదినెంత గాసిలగజేసి
నాడనోక్షమింపుము నేడునన్ను తార !

తార—నావన్నెల చిన్నివాడా ! నిన్నుక్షమింప కుందునా ? నీవుక్షమాపణ కోరుట పాతపాఠమేగద ? మరి, నన్నికనెన్నటికి విడువవుగదూ ? చంద్రా ! ఇకమీదట నీవు నీయిచ్చవచ్చినటులు తిరుగరాదు—నాయాజ్ఞలేనిదే బైటకడుగిడరాదు—
చంద్రు—మరనీవో ?
తార—నేను నీదానను.

సీ. పూర్తిగ వికసించు పుష్పగుచ్ఛమునేను;
చంద్రు— గదియంగవచ్చు తుమ్మెదను నేను;
తార— స్వాతివానలకు ముత్తెపు చిప్పనునేను;
చంద్రు— పొటకరించిన నీటి బొట్టునేను;
తార— పికదర్శనముగోరి వీక్షించు శుకమేను;
చంద్రు— శుకముప్రక్కనజేరు పికము నేను;
తార— ఆనందమునుపొందనగు చకోరము నేను;
చంద్రు— మురిపించు మేటి సోముంత నేను?

తార— గీ. ప్రియునికొరకు వేచు ప్రేయసీ మణినేను;
చంద్రు— ప్రేయసినికి విడని ప్రియుడనేను;
తార— చంద్రునకును తగినదాన, తారను నేను;
చంద్రు— జగతి తారగోరు చంద్రుడేను.

తార—ఆహా! ఎంతటి యానందము ?

ఒక్క పాట

చంద్రు—తారా! పాటకేమిగాని, పాలు చల్లారి పోయినవిసుమీ!

తార—లేదుచంద్రా! లేదు, ఆ పాత్రలోని పాలారిపోయినవిగాని; ప్రేమ పాత్రలోని పాలు పొంగుచున్నవి.

గీ. కాగిపొంగిన పాలు మీగడలుగట్టి
తరుచుకొందునే నిక వెన్నకొరకువేగ;
కృషిఫలించి, సశ్యంబుల కించదొలగ
తినకయుందురే మృష్టభోజనములింక ?

(తెరలో) అమ్మా! తారాదేవీ!

చంద్ర—ఎవరా పిలుచునది ?

తార—ఇంకెవరు ? మనపద్మ!

చంద్ర—ఇంతలోనే యేమితొందర వచ్చిపడినది! తారా! పద్మను కొంచె మాగిన పిదపరమ్మనిచెప్పరాదా ?

తార—అటులనే.

తెరలో—అమ్మా! చంద్రుడు కనుపించలేదని మనర క్తి, ము క్తిభయపడు చున్నారమ్మా! ఒకసారి కనపడి పొమ్మనిచెప్పండి.

చంద్ర—నిద్రపోవుచుంటినని చెప్పు తారా!

తార—పద్మా! ఏమే, నీయాగడము; చంద్రా! అబద్ధములు నేర్చుకొను చుంటివా ?

చంద్ర—అంతయు నీప్రభావమే తారా? సరికాని, నిజముగనేను కొంచె మునిద్రపోవలయును.—(అనిశయ నించును)

(తెర జారును)

ఓమ్

# తారాశశాంకము

## చతుర్థాంకము

(స్వర్గలోకమున, దేవేంద్రుడు, మాతలి

కూర్చుండి యందురు; తెరలేచును.)

దేవేం—వత్సా! మాతలీ!

మ. చనినావా మునియాశ్రమంబునకు, నా సందేశమున్ వానితో
ననినావా? వినినాడ; మద్గురుడు నెయ్యంబొప్ప నీ ప్రార్థనల్?
కవినాడా నిను గౌరవంబున మరేకార్యంబు నభ్యంతరం
బని వాకృవ్వకె వచ్చినాడ? ఇపుడా పుణ్యాత్ముడో మాతలీ!

మాత—ప్రభూ! గురుదేవులు బృహస్పతి భగవానులువారు మీ కోరిక నెప్పుడేనియు నిరాకరించి యెరుంగుదురా; నేడు నిరాకరించుటకు? నే నటకేగి, విమానంబునుడిగ్గి; పాదచారినై యాశ్రమంబునందున్న బృహస్పతులవారిని చూచి నమస్కరించితిని.

సీ. వందనంబొనరించి ముందునిల్చిన నాకు
నాసనమును చూపి యాదరించె;
కూరిమితో మీదు కుశలంబు లన్నియు
తగుప్రశ్న చేసి సంతసము నొందె;
తమయాన నానోట వినినంత, మారుమా
టాడక వెంట ప్రయాణమయ్యె;
ఆశ్రమకార్యంబులన్నింటి విడనాడి
దేవక్రతువె, గురుదేవుదెంచె;

గీ. కోపతాపములును లేక, కొరతలేక
మారుమనసులేక-బదులుమాటలేక
సురగురుండు బృహస్పతి శుద్ధమూర్తి.
వచ్చి యుండెనయ్యా! మనస్వర్గమునకు.

దేవేం—ఆ మహనీయుడట్టి శిష్యవాత్సల్యమయుండగుటచేతనే నాకాతని యందభిమానము మెండు.

మాత—కాదామరి?

దేవేం—మాతలీ! గురుదేవులవారి యాశీర్వాద ప్రభావమెంతటి కార్యంబుల నేని సఫలంబొనరించునుసుమా!

గీ. జ్యేష్ఠ, లవ్యపాలననేని నేయదగిన
దానవాళి నవలద్రోసి దర్పమందు
రాజ భోగంబులనుదేలి గ్రాలుచుంట
గురుడొసంగు నాశీర్వాద కరుణవలెనె.

సరికాని మాతలీ! రాజ్యాంగమున వార్తలేమి?

మాత—మన రాజ్యంబున నేవార్తలు లేవుగాని, భూలోకంబున మాత్ర మొక వాడుక వింటిని.

దేవేం—ఏమది?

మాత—ఏదైననేమి? యింద్రా? నీలాపనింద లెన్నియో పుట్టుచుండుట లోక సహజము-విన్నవన్నియు నిజములుగావు—నిజ మందరకు తెలియదు. నిజ మొక తీరునున్న—నింద మరియొక రీతి నుండును.

దేవేం—కావచ్చును. నీవు నాకు చెప్పునది - నే నాలకించునదిగూడ విన్న విషయమే కాని, కన్న కథకాదు గదా?

మాత—కాని, ఎవరెటు లూరేగిన మనకేమి?

దేవేం—మనము మాత్ర మెందులకు వినకూడదు? చెప్పుము.

మాత—మన గురుదేవులైన బృహస్పతి భగవానులవారి భార్య-తార-

దేవేం—ఔనౌను. మహాసౌందర్యరాసి. అనరాదుగాని, ఆ తార నవలోకించిన నెంతటి బ్రహ్మచారికేనియు భ్రాంతి జనింపదా?

మ. గురుపత్నిన్ మన మన్న దోషమను సంకోచంబునౌగాని, సుం
దరి సౌందర్యము సంస్తవంబునగు కందర్పుండు కామించు నా
శరులన్ నెన్నొసలన్ శరీరమెరుగున్ క్రొవ్వాడు చన్దోయినిన్
వరుసన్ గాంచిన బ్రహ్మదేవుడయినన్ వ్యామోహితుండౌగదా ?

మాత—తార యదార్థంబుగ నంతటి సౌందర్యమయురాలే - అందు కను గుణ్యంబుగ నవయవ్వన ప్రాయురాలు గూడను.

దేవేం—తార మహాపతివ్రతాతిలకం బనియు కీర్తి గాంచినది.

మాత—కావుననే యీనింద నమ్మలేకున్నాను.

దేవేం—ఐనను; నిష్కారణముగ నిందవచ్చునా ?

మాత—కావుననే, కాదన లేకున్నాను.

దేవేం—మరే మందువు.

మాత—ఏమనుచేల ? తెలిసీ తెలియని దానిని గురించి మన కెందుల కని మనవి చేసితిని.

దేవేం—నీ కా సందియ మక్కరలేదు. చెప్పుము.

మాత—తార చంద్రుని ప్రేమించినదని బృహస్పతులవారి యాశ్రమంబున గుట్టలుబడి చెప్పుకొనుచున్నారు.

దేవేం—కాదా మరి ? ఇట్టి యపవాదు తారకే వ్యాపించు చుండును. మాతలీ ! ఇంత కా చంద్రు డెవరు ? తార కెట్లు పరిచయంబు ?

మాత—ఆ విషయంబు మీ కింకను తెలియదా ?

గీ. అత్రి నేత్రాన గలుగు నెయ్యంపు బిడ్డ;
మరచినాడవు గాని నీ కెరుకె యతడు—
శిష్యుడై బృహస్పతి పంచ చేరియుండ
కాంచి, మదమున మించి, కామించె తార.

దేవేం—అటులనా ? అత్రి తన కుమారున కీ విద్య నేర్పుటకేనా బృహస్పతులవారి యాశ్రమంబున కనిపినది ?

ఆ. వె. చదువుచెప్పు మనుచు, సంధ్యచెప్పు మటంచు
పంపియుండె నత్రి పాప నటకు;
యేది యెట్టులైన నీ విద్య మాత్రంబు
చెప్పెనేమొ తార, చేరదీసి !

అయినను మాతలీ ! తార కామాత్రము యుక్తాయుక్త విచక్షణలేక పోయినదా ? చంద్రుని వయ సెక్కడ ? తార వయ సెక్కడ ?

ఉ. ప్రాయమునందు పిన్నయను భావమొకింతయులేక; తార య
న్యాయ మటంచునెంచకయె, అత్రికుమారుని పొందుగోరె నౌ
రా ! యిటువంటి పాపమునకై యొడిగట్టు నటంచు యోచనల్
సేయగలేదు - విద్యకయిచేరిన శిష్యుని గోరబాడియే ?

మాత—ఇంద్రా ! కామాంధులకు యుక్తా యుక్తంబులు దెలియునా ? ఫలాఫలంబులు కనుపించునా ? కాని; పురందరా ! తారకు చంద్రునకు వయోబేధ మనుచుంటివి. నిజమే—ఆ వయో తారతమ్యము నవలోకించిన తార వయసెక్కడ ? బృహస్పతులవారి వయసెక్కడ ?

మ. పతికంటెన్ సతిపిన్నయౌట నగు నీ వైవాహికంబంట స
మ్మత మంచొప్పితి - కాని; భర్తలవురా నూరేళ్ళ ప్రాయంబులో
నతిబాల్యంబున నున్న కన్నియల బెండ్లాడంగ నేపాటి సం
స్తుత కార్యంబగు ? పక్షపాతమిది యీ సూక్ష్మంబుయోచించినన్.

దేవేం—మాతలీ ! ఆ విషయంబునకు వచ్చినచో మనముచేయు పను లన్నిటి యందును దోషంబులుండ వచ్చును. వాటికేమిగాని-యింతకు చంద్రుడెంతటి యదృష్టవంతుడో కదా ?

మాత—ఎందువలన ?

దేవేం—ఎందువలన నందువా ?

ఉ. మేటిమగండు లెల్లరు శ్రమింప - భ్రమింపవి తార - తానునై
సూటిగ ప్రేమచూపునను చూచుచునుండగ, హాయిమీర నా
బోటి సుఖంబునన్ దనరు పున్నెము చంద్రుని కబ్బెనౌర, యీ
నాటికి తారశీలము గనంగ హరించెవ దేటికో గదా ?

మాత—ప్రభూ! ఇందుమరొక విషయంబుగలదు.

దేవేం—ఏమది ?

మాత—ఏమంటిరా !

సీ. తారలో వచ్చిన తారుమారులెగాని
చంద్రుంకు చత్రాయి చందమనుచు;
చంద్రుడింతయునైన చనవీయకున్నచో
తారలోనుండ దీ తప్పటంచు
వా రిరువురిమధ్య పాప మింతయులేదు
నాటక మొక కారణంబటంచు
పద్మయనెడు దాసి వన్నాగమున వింత
వట్టి వాదొకటియే వచ్చెననుచు

గీ. అల బృహస్పతి యాశ్రమమందు గలుగు
శిష్యు లంద రన్నిగతుల చెప్పుకొనిన
చిన్నచిన్నగ నెట్లొ నా చెవులబడియె
అచటి మాట లొకటి రెండు నమరనాథ!

దేవేం—లోకులు పలుకాకులట్లు యెవరికి దోచిన భంగి వా రనుకొనుట సహజమే. అందు విపరీత మే మున్నది? ఆశ్చర్య మేమున్నది ? మాతలీ! ఈ విషయంబు గురుదేవులవారికి తెలియునా ?

మాత—తెలిసియుండదు.

దేవేం—నిజము తెలిసియుండి గురుడు సైరించునా ?

మాత—ప్రభూ! పాప మెన్నటికేవియు బైటపడకుండునా? నడుమ మనమేల చెప్పవలయును? అనవసర వాగ్వైరంబుల నేల పొంద వలయును ?

దేవేం—అవును. నీవుబోయి వెంటనే బృహస్పతి భగవానులవారిని గౌరవ యుతంబుగ వెంటగొని రమ్ము. మనము సంకల్పించిన యాగమారం భము చేయుటకు వలయు సన్నాహంబులను చేయింపవలయును.

మాత— చిత్తము! (నిష్క్రమించును.)

దేవేం— ఆహా! తార! ఏమిసౌందర్యము ?

సీ. పసిడికాంతుల కీడువచ్చు మేనిసొబగు;
మెరపుతీగెలబోలు కురులసొంపు;
తామరపత్రాల దనరారు కనుదోయి;
భాసురమై యొప్పు నాసికంబు;
దొండపండుల మించియుండు నోష్ఠబింబులు;
కనగ; శంఖమువంటి కంఠసీమ;
యిసుక తిన్నెల కీడుయింతి స్తనయుగంబు;
శూన్యమై కనిపించు సుదతి నడుము;

గీ. గిరు లనంగనొప్పు చెలువ పిరుదులలరు
అరటి కంబంబు లంకంబు లమరునట్టి
తార తోడుతరతికేళి దనరువాడు
కోటియజ్ఞ పుణ్యఫలంబు కొన్నవాడె.

(మాతలి ప్రవేశము)

మాత—దేవనాథా! బృహస్పతి భగవానులవారు.

దేవేం—చాలా సంతోషము. (ఎదురేగి నమస్కరించుచు) దేవా! దయ చేసి యీ పీఠమలంకరింపుడు.

(బృహస్పతి ప్రవేశము)

బృహ—వత్సా! సంకల్ప సిద్ధుడవుగమ్ము.

చ. అనుకొనకుండ నన్ బిలువనంపిన కారణమేమి? యిప్పుడే
దనుజుడునైన మిమ్మలను దర్పముతో నెదిరింప నుండెనే?
మనసుర కోటికెల్ల సుఖమా? క్రతువెయ్యదియేని వేయగా
పనివడియుంటివే? తొలుత బల్కుము వేగమ పాకశాసనా!

దేవేం—

క. గురువర! మీరలు మా యెడ
కరుణించి చరించుచుండ కలుగునె కొదు వీ
వరయక క్రతు వొక్కటినే
నెరపంగ దలంచినాడ నిజము మునీంద్రా!

కావున మా కెల్లరకుం గురుదేవు లగు మీతో నాలోచింప దగిన నయ్యవసరంబున మిమ్ము బిలిపించితిని. దేవరవార లనుగ్రహించి యీ క్రతు కార్యంబు సమాప్తియగు వరకిందేయుండి శిష్యుల కార్య క్రమం బవిఘ్నంబుగ సాగింపవలయునని వేడుచున్నాను.

బృహ—వత్సా! శచీధవా! నీ సంకల్పమున కే నెన్నడేనియు నంత రాయమును చెప్పితినా? ఇకముందు చెప్పుదునా? నీ యిచ్చ వచ్చి నటులే గావింతును. కార్యక్రమం బుపక్రమింపుము. నీ సంకల్పమేమి? వాంఛించిన ప్రతిఫలమేమి?

దేవేం—గురుదేవా! మీ రెరుగనిదేమున్నది?

ఉ. దానవు లెల్లవేళల, యథావిధి దివ్యతపంబు జేసి, యె
ద్దాన గతింపకుండు వరదర్పము లాపరమేష్టవల్లనో?
పూనిక శూలిసత్కృపనొబొంది, బలంబున మాటిమాటికిన్
మానక దేవలోకమున మారణహోమము సేయరారొకో.

ఆ కారణంబున

మ. మనకుం గర్భవిరోధులై వరలు దుర్మార్గుల్, మదోన్మాదకుల్
దనుజుల్ గావున వారి వంశము సమాప్తంబై చనన్ జాలునే
ఘనయజ్ఞంబగు? దానినిన్ సలిపి యీ గంధర్వ లోకంబులో
నణుమాత్రంబు భయంబులేక గను మార్గాన్వేషి నేవియ్యేడన్.

కావున, అట్టి సకలార్థ ఫలప్రదంబగు నొక్క మహాయజ్ఞంబు నాలోచించి వచింపుడు. ఒనరించెద.

బృహ—పురందరా! నీ యాలోచనయు సమంజసముగనే యున్నది కాని, ఏదియెటులైనను దైత్యులు మీ సోదరులు-చారెడు రక్తమును పంచు కొని జనించినవారు-

దేవేం—గురుదేవా! దాయాది మచ్చరంబు మీరెరుంగనిదియా! అది యునుగాక, యితర సోదర ధర్మమువేరు - మా సోదర ధర్మమువేరు. మా కుదయించిన మచ్చరంబు లౌకనాటివి కావు- మించిపోవున వంత కంటెను కావు. కావున మీరందును గురించి విచార మంద నక్కర లేదు.

బృహ—ఇంద్రా! నీ కింకను రాజ్యాంగ మర్మములు తెలియవు.

దేవేం—ఏమి?

బృహ—అనుభవంబు చాలదు.

దేవేం—ఎట్లు?

బృహ—ఒక్కొకమారు శత్రువుల వలననే మహోపకార్యంబులు సమకూరును. నీకు జ్ఞప్తిలేక పోవచ్చునుగాని మున్నొకమారు మీకా దానవుల వలనే ఘనకార్యము ఫలించినది.

దేవేం—ఎప్పుడు?

బృహ—పాలసముద్రమును తరచిననాడు.

దేవేం—నిజము గురుదేవా! ఆ నాడు దానవులు లేకున్న మీ దేవులు గతించి యుండెడివారె. కాని, అంతమాత్రమున వారు మాకు మిత్రుల గుదురా? శత్రుత్వమును మరతురా?

బృహ—కాకపోవచ్చును.

గీ. పాలకడలిద్రచ్చి; సుధను బడయునాడు
రాక్షసులు నాగరాజ శిరంబు బట్టి
కున్న - పట్టజాలునే పరుండొక్కడైన -
అమృతమును మీ కొసగిన వారరయవారె.

దేవేం—అంతమాత్రమున వారు మాయందు దయగల వారగుదురా? అమృతార్థంబున కాసించినాడా పనికి సాహసించిరికాని; కేవలము క్షీరాంబుధినుండి యమృతమును దీసి మాకివ్వవలయుననిశ్రమించలేదు.

బృహ—నిజమే అంతగ సాహసించినవారికి, మొదట మనమనుకొన్న యొడంబడిక ప్రకారమేనియు నర్ధపాలొసంగక మోసగించితిమిగదా! ఇంద్రా! ఇంతకు నా యభిప్రాయము నీవు గురుతింపలేదు. దానవులు సాహసికులు - వీరప్రతాపులు - దుర్వార దీక్షా పరతంత్రులు—దీనైన వారుకావ మరలనట్టి యుపద్రవములు సంభవించినపుడు మాయోపాయంబుల నిట్టివారిచే మనము గట్టెక్కుచుండ వలయును. అందు

లకై వారు లేకపోయిన నెప్పటికేమి మోసమువచ్చునో చెప్పజాలము. కావున వారినొకకంట గమనించుచు - పాదములక్రింద త్రొక్కిపట్టి- మీదుమిక్కిలి యుక్కుమీరు రక్కసుని మాత్రమే చంపవలయును.

దేవేం—అటులైన యాగమొనరించు యత్నము విరమించుకొందమా ?

బృహ—ఆదేల ?

దేవేం—యాగఫల మనావశ్యమని మీ రంటిరికాదా ?

బృహ—యజ్ఞఫలంబును మఱొకరూపంబున కోరరాదంటినా ?

సీ. సకలాస్త్ర శస్త్ర గదాయుధా నూన నై
పుణ్యంబు నర్థింపు పూన్కిలేదె ?
శత్రుసేనల గెల్చు శక్తి సామర్ధ్యంబు
సాధింప నింత యాసక్తిలేదె ?
శాశ్విత సురలోక సార్వభౌమత్వంబు
నిల్పుకొనెడు వాంఛ నీకులేదె !
ధర్మపత్నీ సమేతంబుగ సుఖమందు
వరములాగైకొను వాంఛలేదె ?
గీ. ఎన్నియో కోర నర్హంబు లింకలేవె ?
ఒకటి కాదన్న మాత్రాన సకలముడిగి
యాగయత్నంబు కూడనిదనగలేదు
సలుప వచ్చును వేరొక్క జన్నమీవు.

దేవేం—అటులైన నా యజ్ఞమేదియో నాలోచించి తెలవిండు.

బృహ—మంచిది. అటులనే చెప్పుదుము. ఇపుడు దేవతార్చనకు వేళైనది.

దేవేం—పోయిరండు.

(బృహస్పతి నిష్క్రమించును.)

దేవేం—ఆహా ! నేనొకందులకై యాగంబు సేయవలయు ననుకొన్న నా యాగంబు మఱొకందులకుగా పరిణమించినదిగదా ? కానిమ్ము. ఎటులైననేమి క్రతువొకటిచేయుటయు మంచిదియే.

(నారదుడు ప్రవేశము.)

దేవేం——నారదమునీంద్రులవారి కభివందనములు. రండు, ఈ పీఠమలంక రింపుడు.

నార——(కూర్చుండి) ఇంద్రా! క్షేమంబుగ నుంటివిగదా?

దేవేం——పెద్దల దయవలన. మహామునీ! నాదొకప్రార్థన.

నార——ఏమది?

దేవేం——మరేమియునులేదు.

చ. అమిత ఫలప్రదాయకమునై వెలుగొందెడు యాగమున్ బృహ
స్పతి, గురువర్యుడెంచి, దెలుపంగ-దలూచిరి, రేపు-మాపటన్
క్రతువొక టాచరింతునటు గావున మీరును వచ్చి, శ్రద్ధ, మ
త్కృత పరిచర్యలన్ గొవియు ధన్యుని నన్నొనరింపు డెంతయున్.

నార——(ఆలోచించుచు) అంతయు బాగుగనే యున్నదిగాని,

దేవేం——ఆలోచించుచున్నారేమి?

నార——ఆఁ! మరేమియునులేదు. ఆ యజ్ఞమున బృహస్పతి కర్తృత్వమే కొంచెమేనియు నుండునుగదా?

దేవేం——అయ్యో! లేకపోవుటేమి? వారు మాగురు చంద్రులు గదా?

నార——కాదనలేదు.

దేవేం——మరిమీపందియమేమి?

నార——నేనుమాత్రము మున్నెన్నడైన గురుచంద్రునిగూర్చి ప్రశ్నించితినా? నేడట్లు లడుగవలసి వచ్చినది——అడిగితివి.

దేవేం——అనగ?

నార——సాటి మునీంద్రులందరు నీబృహస్పతిని వెలివేయ మన్నారు. ఈ సమయంబున నా తండును పెద్దరికముబూనిన యాగంబునకు "పది మంది వత్తురా! రారా?" యని సందేహము గలిగినది?

దేవేం——నా యాహ్వానంబునకు రాని వారుందురా?

నార——రావచ్చును. ఇంద్రా! అంత మాత్రమున ప్రయోజనము లేక పోవగ ప్రమాదమును రానున్నది.

ఉ. వచ్చిన వారలెల్ల, దినవచ్చును; హాయిగా నిందు నుండగా
వచ్చును గాని; దేవగురువర్యులు వచ్చినవేళ, చర్చకున్
వచ్చును తార వర్తనము, పైవిషయంబున నాతదేగతిన్
మచ్చరమూనునో ? మరల మౌనులు నేమను వారలోగదా ?

అట్టియెడ నొకవేళ నీ మునిచంద్రు లందురు నుపేక్షించినను శుక్రు డంగీకరించునా ? వాని నోరుం గట్టివేయు వారుండిరా ? అత డసలే రాక్షసులకు గురువు.

దేవేం—అతనికి మన మాహ్వాన మిచ్చిన గదా ?

నార—నీ యాహ్వానముతో వారికేమి పని ? అదిగాక శుక్రు డేమైన నీ యింటిలో భోజనము చేయవచ్చునా ? నీ మర్యాదల కాసించునా ? అతనికి కావలసినది పదిమందిలో బృహస్పతులవారిని పరాభవించుట. అందులకు తగినట్లు;

అ. వె. చదువు కొనగవచ్చు చంద్రుని రతిగూడి
కులుకుచుండె తార, వలపు దీర,
విశదపరచి గురుని వెలివేయగా నుండె
శుక్రు డెంతయేని వక్రబుద్ధి.

కావున నేదియో యాటంకము రాకుండ నీ యొనరించు యజ్ఞంబు కొనసాగునను నమ్మకము నాకు లేదు.

దేవేం—మహాముని ! తార చంద్రునితో నిట్లు మెలగు చున్నమాట యదార్థమేనా ?

నార—ఏమో, నేను మాత్రము చూచితినా ? దేశములను తిరుగుచుండు వాడను గావ నీ నాలుగు మాటలు నా చెవుల బడినవి.

దేవేం—ఏదియో యొకింతయు లేవియెడల యంత నింద వచ్చునా ?

నార—రాదు— రాదు.

దేవేం—గురుమహాదేవులు బృహస్పతి భగవానుల వారిందే యున్నారు ? వారితో.........

నార—అమయ్యో! ఇంకేమయిన నున్నదా? ఆ మాటలనినచో నీవు నేనును బ్రతుకగలమా?

మ. మనమేలా? యిటువంటి చిక్కుతరిలో మాటాడగా, మౌనియే
మనునో? శుక్రుడెవచ్చి బైటపడగా నాలోచనల్ సేయుచుం
డిన వాడేటికి మిన్నకుండును? అతండే వాని ప్రశ్నింప జా
లినవాడాపయి వారువారలె మరేరీతందు భాషించినన్.

కావున మనకా విమర్శనలెందుకు? అదియునుగాక వారు తీక్ష్ణజిహ్వాగల మహాఋషులు, వారి కాగ్రహావేశమైనచో ముందు వెనుక లాలోచింపక శపింపగలరు.

దేవేం—మీ యుపదేశము మిగుల యుక్తి యుక్తముగ నున్నది.

నార—మరినేవింక బోయివత్తునా?

దేవేం—నారదా! శుక్రుండేమనియె?

నార—ఏమనుటకేమున్నది? తారలోపంబును ప్రపంచమునకు వెల్లడించి పదుగురిలో బృహస్పతి నవమాన పరతునవె.

దేవేం—ఐన, యిందు నాకొక్క సహాయము సేయుదువా?

నార—చేతనైనచో.

దేవేం—ఇందు ప్రస్తుతము యాగప్రయత్నమును విరమింతును. ఈ విషయంబు నెటులేనియు మరుగునందుంచుటయే మంచిది. శుక్రుడు మాత్రము మన నాకమునకు రాకుండచేయుము.

నార—దానికేమి? అటులేచేయుదును, నేవింక పోయివచ్చెద.

(నిష్క్రమించును)

దేవేం—గురుమహాదేవులు బృహస్పతులవారికి కోపమురాకుండ నెదేని యుపాయంబున క్రతుప్రయత్నమును మార్పుచేయుట నా కావశ్యము గదా! పోయిప్రయత్నించెద గాక.

(నిష్క్రమించును.)

## రెం డ వ రం గ ము

(ఆకాశమార్గమున శుక్రుడునడచుచుండ-నారదుడు యెదురగును.)

నార—శుక్రాచార్యులవారా!

శుక్ర— నీవా, నారదా! ఎచటకు నీ ప్రయాణము?

నార—నా ప్రయాణమునకు కారణ మేముండును? నిత్యమూ జరుగు చుండు పనియేగదా? నీ వెచటికో త్వరత్వరగ పరుగిడుట చూచి, నిన్ను విచారింతమని యిటు వచ్చితిని.

శుక్ర—అటులనా? ఐన నేను బృహస్పతీ యాశ్రమంబునకు బోవు చున్నాను.

నార—అదేమి? మీరు-బృహస్పతి యాశ్రమంబునకా?

శుక్ర—ఏమి? పోకూడదా?

నార—పోవచ్చును. అందులకేదియో గొప్పకారణముండవలయునుగదా?

శుక్ర—కారణములేకపోవుట యేమి? కావలసినంత కారణమున్నది.

నార—ఏమి?

శుక్ర—ఏమందువా? ఆ బృహస్పతి భార్యయగు, తార—

ఉ. లోకమునందు తానొకతె లోపములేని పతివ్రతా సతీ
పోకడబోయె, కానిపుడు బుద్ధి తిరంబు దొలంగి కామ భా
వైక తరంగడోలికల హాయిగ చంద్రుని గూడియుండె నా
పోకున నీ బృహస్పతిని సంఘములో వెలివేయగావలెన్.

నార—(నవ్వుచుండును.)

శుక్ర—ఎందులకట్లు నవ్వుదువు?

నార—నవ్వు వచ్చుటచేత.

శుక్ర—నవ్వునకు కారణము?

నార—నీ యవివేకము.

శుక్రు— (రోషముతో) ఆఁ!

నార—ఔను. అవివేకమె.

శుక్రు—ఎటులు ?

నార—ఆశ్రమంబున యిపుడెవరున్నారు ?

శుక్రు—ఎవరును లేరా ?

నార—లేరు,

శుక్రు—ఎక్కడకు పోయిరి ?

నార—స్వర్గమున దేవేంద్రు డొక యజ్ఞముసేయ దలంచి బృహస్పతిని పిలువనంపె.

శుక్రు—తారాచంద్రులును స్వర్గమునకు బోయిరా ?

నార—లేదు. వారా యాశ్రమమందే యుండిరి.

శుక్రు—ఇంకేమి ?

నార—ఏమియునులేదు. తారాచంద్రు లెందున్ననేమి ? నీ విపుడు వెలివేసి; అవమానబరుపనున్నది బృహస్పతిని—ఆ బృహస్పతి యింటిలోలేడు—అదియునుగాక—

చ.పదుగురు చూచుచుండ, నపవాదును పూన్కి యొనర్పకున్న న
య్యది నిజమైనగాని, జగమౌనను టెట్టులు ? నీకు వానికిన్
వదలకనున్న వైరమున వాడిటు కల్పితమయెనన్న చో
పెదిమ మెదల్పగాగలవె ? పేచికిరాదె త్వదీయవాదమున్.
అందుపై పదిమందియు నిన్నే నిందింతురు.

శుక్రు— ఎందులకు ?

నార—చేతగాని మాటలు చెప్పినందులకు, శుక్రాచార్యా ! ఇప్పుడు నీ వటకేగినచో తార కనుమానముకలిగి జాగ్రత్త నొందగలదు. నీవు నిజముగ కార్యంబు సాధింతువేని, మారుమాటాడక వెనుకకు మరలుము. తారాచంద్రులు తమ విలాసంబుల నెవ్వరును గమనించలేదుగదా యను ధైర్యంబున మరింత విచ్చలవిడిగ చరించుచుందురు. ఆ సమయంబును బృహస్పతియు కనులార చూచినప్పుడు మాటలాడినచో నీ వాదనకు బలము వచ్చును— విన్నవారు మెచ్చును.

శుక్రు—ఐన యిపుడు నన్నేమి చేయమంటివి ?

నార—ఇప్పటికి మారాడక వెనుకకు తిరిగి పోవుటయే.

శుక్రు—నన్ను నీవు మోసగించుట లేదుగదా ?

నార—అనుమానమున్న నాలోచించుకొనుము—నేనుకాదంటినా ?

శుక్రు—నారదా ! సరె, నీ మాటలునమ్మి నేను తిరిగి పోవుచున్నాను,

నార—చాలమంచిది.

శుక్రు—ఆహా !

గీ. ఆల బృహస్పతి కవమానమైన, కాంచి
సంతసింప నెంచినవాడ స్వాంతమందు;
సమయ మబ్బియు వేరొక సాకుతోడ
తొలిగిపోయె నేటికి; వట్టి తలపులయ్యె.

(నిష్క్రమించును)



ఓమ్

# తారాశశాంకము

## (పంచమాంకము)

(రక్తి, ముక్తి ప్రవేశము.)

రక్తి—ఒరేయ్ ముక్తీ!

ముక్తి—ఏమిటిరా రక్తీ!

రక్తి—ఇంకాయేమున్నదిరా? ముందువచ్చిన చెవులకంటె వెనుకవచ్చిన కొమ్ములు వాడిపైనవిరా!

ముక్తి—అదేరా! పాతలోవుండేరోత.

రక్తి—రోతగాదురా! మనగీత.

ముక్తి—రక్తీ!

రక్తి—ఆశ్రమంలో మనముంటున్నాం అనుకో. అప్పుడు మనంచెప్పినట్లు వీరంతావిన్నారు. మన తరువాత చంద్రుడు వచ్చాడు. ఇప్పుడు చంద్రుడు మాటంటే అందరువింటున్నారుకదూ? మరొకడు వచ్చాడనుకో. అప్పుడు చంద్రుడుగూడ మనలోకే చేరుతాడు.

ముక్తి—ఒరేయ్! చంద్రుడి విషయం వేరురా! తక్కినవారి విషయంవేరు.

రక్తి—ఎందుకని?

ముక్తి—చంద్రుడిలో ప్రత్యేకమైన ఆకర్షణ వున్నదిరా!

రక్తి—ఏమిటది?

ముక్తి—అందం.

రక్తి—ఔనౌను. ఐతే మనంగూడా అందంగానే వుండగూడదూ!

ముక్తి—అందంకావాలంటె వస్తుందటరా!

రక్తి—మరెలావస్తుంది?

ము క్తి—పుట్టుకతో రావాలసిందేరా !

ర క్తి—ఐతే మనం గూడా మళ్లీ పుట్టితే అందంగ వుంటాం గదూ ? మరి పుట్టే వుపాయం చూడరా !

ము క్తి—ఓరేయ్ ! మళ్ళీ పుట్టాలంటే ముందు చావాలిరా !

ర క్తి—అమ్మయ్యో ! చావటమే ? నా వల్లగాదు బాబూ !

ము క్తి—చావాలి. చస్తేనేరా, మళ్ళీ పుట్టేది.

ర క్తి—ఔనురా ! చచ్చిపోతే అపుడు మనకు మళ్ళీ బాల్యదశ వస్తుంది. అప్పటికి చంద్రుడు మనకంటె ముసలివాడై పోతాడు. పద్మ మనల చూచి ప్రేమిస్తుంది. కాని, చచ్చేదెలా?

ము క్తి—ఏమున్నది ? ఉరేసుకుంటే చాలు— ఊరికనే చచ్చి కూర్చొన వచ్చును. అంతే.

ర క్తి—గొంతు నొప్పి కదరా !

ము క్తి—మరి- నీళ్ళలో పడితే ?

ర క్తి—కప్పలు కరుస్తాయిరా !

ము క్తి—విషం తింటే ?

ర క్తి—చేదుగ వుంటుందిగా !

ము క్తి—మరి యెలా చచ్చేదిరా !

ర క్తి—ఎలాగో చావరా ! నీ వెంట నేనూ చస్తాను,

ము క్తి—ఐతే, నేను గొంతుకు వురి వేసుకొనే చస్తానురా ! ఎందుకంటే ? ప్రాణం పొయ్యే లోపల భగవంతుడు ప్రత్యక్షమై "ఒరేయ్ ! ము క్తి ! నీ భ క్తికి మెచ్చాను. నీ కే వరం కావాలో కోరుకో" అంటే, చంద్రుడి కన్నా మించిన చక్కదనం కావాలని వరం కోరుకొంటాను.

ర క్తి—ఈ వుపాయం యింకా బాగున్నదిరా ! ఐతే, నేను గూడ అలాగే చేస్తాను.

ము క్తి—ఐతే, వురే వేసుకొందాం.

రక్తి—సరే, కానియ్యి. (అని తమమీద నున్న అంగవస్త్రాలు తీసి చెట్టు కొమ్మలకు గట్టి మెడలకు తగిలించుకొంటారు.) ఒరేయ్ ముక్తీ! ఒక్కసారి భగవంతుడ్ని ప్రార్థించరా! ప్రాణాలు విడిచేద్దాం.

(పద్మ ప్రవేశము.)

పద్మ—(తనలో) ఈ బ్రహ్మచారిముండాకొడుకు లిద్దరూ ఎక్కడకు పోయినట్లు? (చూచి భయపడి) ఆఁ ఇదేమిటి? వీళ్ళిద్దరూ వురివేసుకొని చచ్చిపోయారా?

రక్తి—ఒరేయ్, ముక్తీ!

పద్మ—(తనలో) ఇంకా చచ్చిపోలేదు. బ్రతికేవున్నారు. నే నీ పొదచాటున దాగి వీరితంతు చూస్తాను. (దాగును)

ముక్తి—ఏమిటిరా రక్తీ!

రక్తి—కళ్ల గట్టిగ మూసుకొని దేవుడ్ని ధ్యానించు, మనకు ప్రత్యక్షమై వరాలు యిస్తాడు.

ముక్తి—సరే. నీవుగూడా అలాగేచెయ్యి. (ఇద్దరు కళ్లమూసుకొంటారు.)

పద్మ— (తనలో) ఈ సమయంలోనే బైటపడి వీరిద్దరినీ కొంచెంసేపు ఆటలాడించిచూచెదనుగాక, (వారిద్దరి ముందునకు వచ్చి నిలుచుండి; కంఠస్వరమును మార్చి) భక్తులారా! లెండి, కళ్ల దెరువండి; వురి తీసివెయ్యండి.

రక్తి—ఉరి తీయటానికి వీలులేదు.

ముక్తి—కళ్ల తెరువము.

పద్మ—ఎందుకని?

ముక్తి—మేము కోరిన వరం యిస్తానంటే తెరుస్తాం.

రక్తి—ఉరిగూడ తీసివేస్తాం.

పద్మ—తప్పకుండా మీకు వరాలిస్తాను.

రక్తి & ముక్తి—సరే; (అని గొంతులకు వేసుకొనిన వురిని తీసివేసి, నమస్కారాలు చేస్తూ కళ్లు తెరుస్తారు.) ఓసి! భడవాముండా! నీవా? దేవ డనుకొని దణ్ణం పెట్టాం.

పద్మ—దైవమైతేనేం? దేవత ఐతేనేం?

రక్తి—నీవు దేవతవా?

ముక్తి—ఏదేవతవు? వన దేవతవా?

రక్తి—మృత్యుదేవతవా?

పద్మ—కాదు. కాదు. మీకు ప్రణయదేవతను.

ముక్తి—పద్మా! ఈ మాటలు నీ నోటిగుండా విని యెన్నాళ్ళయిందే?

రక్తి—చంద్రుడు వచ్చాక మామాట మరీ బొత్తిగ మరచిపోయినావుగదా?

ముక్తి—ఎలాగైనా, మా తరువాత వాడేగా చంద్రుడు?

రక్తి—కాదురా! చంద్రుని తరువాతనే మనం.

ముక్తి—నీ మొఖం. విశాలమైన యీ ప్రపంచంలో రక్తి, ముక్తి అనేవాళ్ళున్నారని పద్మ మనసులో జ్ఞాపకముంటేగదరా, చంద్రుడి తరువాత మనమో? మన తరువాత చంద్రుడో, అని అనుకొనేది?

రక్తి—ఔనౌను.

పద్మ—ఔనేమిటి, మీ మొఖం?

ముక్తి—అందుకనేగా! ఈ ప్రయోజనంమాలిన బ్రతుకు బ్రతకటమెందుకని చచ్చిపోదాం అనుకొన్నాం.

రక్తి—ఎలాగో చచ్చిపోయేవాళ్ళం, గదా? మమ్మల్ని అలాగైనా చావనిచ్చేవా?

ముక్తి—మా కిటు బ్రతుకూ కాకుండ, అటు చావు కాకుండ చేస్తే యెలా?

పద్మ—ఇపుడు నన్నేం చేయమంటారు?

ముక్తి—కోరిన వరాలిస్తా నన్నావుగా?

పద్మ—మీ కే వరం కావాలి?

ముక్తి—మేము వచ్చే జన్మలో చక్కని వాళ్ళమై పుట్టేలా వరం కావాలి,

పద్మ—భగవంతుడు మీరు కోరిన వరం యిస్తాడు కాని, అందులో మరొక చిక్కు వచ్చిందే ?

రక్తి—ఏమిటది ?

పద్మ—మీరు చచ్చిపోయాక మళ్ళీ మానవజన్మ లెత్తరని, ఈసారి కోతి జన్మ వస్తుందని, ఆ కోతులలో అందమైన వారుగ బుడతారని మన గురుదేవులవారు చెప్పగ విన్నాను.

ముక్తి—ఇది పెద్ద చిక్కేనే ?

రక్తి—ఎంత అందంగ పుట్టితే మటుకు కోతుల మయితే యెలాగురా ?

ముక్తి—అందుకని యేమి చెయ్యాలి ?

రక్తి—గురుదేవులవారు బృహస్పతి భగవానుల కాళ్ళ మీదపడి ఈ సారి మటుకు వానరజన్మలు వొద్దు-నరజన్మలే వచ్చేలాగా బ్రహ్మదేవుడితో చెప్పమని వేడుకొందాం.

ముక్తి—బాగున్నదిరా నీ యాలోచన.

రక్తి—అంతేరా ! అలాచేస్తే మనం యీసారి చంద్రుడికంటె చాలా చక్కని వారమై పుడతాం.

ముక్తి—పద్మా ! ఇపుడు నీవు, మన తారాదేవిగారు చంద్రుడే చక్కని వాడను కొంటున్నారు గదా ! రేపు మముల్ని చూచి ఎలా గంటావో తెలుసునా ?

పద్మ—ఏమిటీ ? అసలు విషయం చెప్పండి.

ముక్తి—అలా అడుగు చెపుతాను మరి. చంద్రుడు వచ్చిన దగ్గరనుండి నీవు బొత్తుగ మావైపు చూడటంలేదు. అందుకని మేము మళ్ళీ వచ్చే జన్మలో చక్కనివాళ్ళమై పుట్టితే నీప్రేమ మావైపునకు తిరుగుతుంది.

పద్మ—బాగున్నది. మీరు చచ్చి, మళ్ళీపుట్టి, పెరిగి యింతవాళ్లయి యిక్కడకు వచ్చేసరికి నేను ముసలిదానను కామా ?

రక్తి—ఆమాటా నిజమేరా ముక్తీ !

ము_క్తి—కాదటరామరి ర_క్తీ!

ర_క్తి—అందుకని చేసేదేమిటి?

ము_క్తి—నాకుమాత్ర మేం తెలుసునురా?

ర_క్తి—పద్మా! నీ ప్రేమకోసం తపసు చెయ్యమంటే చేస్తాం. గుంజిళ్లు తియ్యమంటే తీస్తాం. ఎందులోనన్నా పడి చావమంటే చస్తాం. కా_స్త మావైపు ప్రేమతో చూడవే.

పద్మ—ఇపుడు నేను ప్రేమిస్తునే యున్నానుగా?

ర_క్తి—నిజంగానా?

పద్మ—నిజంగానా! యేమిటి? నీ తోడు.

ము_క్తి—మరి నా మీద ఒట్టుపెట్టుకొనవేం?

పద్మ—నీమీదగూడ వొట్టే.

ము_క్తి—మరి చంద్రుడో?

పద్మ—అమా టంటివా? దవడ పగిలిపోతుంది.

ము_క్తి—పోనియ్యిలే, పగిలిపోయేది దవడేగదా? గుండె పగిలిపోకపోతే చాలులే.

పద్మ—పెచ్చుగ మాటాడితే మూతిపళ్ళు రాలగలవు.

ర_క్తి—సరసం ముదురు పాకంలో దించకు.

ము_క్తి—సరేకాని. యింతకు చంద్రుడు వెలుపలికి రావటం పూ_ర్తిగ మానుకొన్నా డెందుకని?

ర_క్తి—ఆ మాత్రం తెలియదురానీకు? మనం బొత్తుగ ఆశ్రమంలోనికి పోవటం మానుకొన్నాం కాబట్టి, ఆశ్రమం విడచి బైటకు రావటం బొ_త్తిగ మానుకొన్నాడు మన చంద్రుడు—

ము_క్తి—సరే "మనతోబాటు తిరిగే పద్మగూడా చంద్రునితోనే లోపల యెంచేస్తుంది" అని?

ర_క్తి—ఆ విషయం నీ కెందుకు?

ము క్తి— ఎందుకో అడిగాను. చెప్పితే చెప్పు-చెప్పకపోతే చెప్పనని చెప్పు. దానికి దండ నేమున్నది ?

ర క్తి—అదేమిటిరా వెఱ్ఱిమొఖమా ? రేపు గురువులవారు బృహస్పతి భగవానులువారు వచ్చిన తరువాత మనిద్దరిని పిలిచి "ఒరేయ్! శిష్యులారా! ఇన్నాళ్ళనుండి మీరేం పాఠాలు చదివారు ? చంద్రుడేం విద్యలు నేర్చుకొన్నాడ"ని అడిగితే మనమేమి చెప్పాలి అనేది మొదటి విషయం.

ము క్తి—అదికాదురా! మన కెలాగూ చదువురాదని మన గురువుగారికి తెలిసిన విషయమేగా ? అందుకనే మనమిక్కడ యిన్నాళ్ళున్నాం. ఎప్పటికి వెళ్ళుతామొ చెప్పలేముగూడా!

ర క్తి—నిజం. నిజం. నిజం మాటాడితే బ్రతికినంత కాలమూ గురువుగారి సేవచేస్తూవారి యాశ్రమంలోవుండే నిజమైన శిష్యులం మనమేరా!

ము క్తి—ఆ సంగతి తెలిసిగూడ పద్మకు మనమీద కాస్తయినా మమకారమున్నదా ?

ర క్తి——మన గురువుగారికైనా మనమీద శ్రద్ధాభిమానా లున్నవి గాని—

ము క్తి——మనమీద గురువుగారికి మంచిప్రేమ వున్నదిరా! అందుకనే మాటిమాటికి మనలనుచూచి గురువుగారు "బ్రహ్మచారి శతమర్కటః" అంటుంటారు.

ర క్తి——ఆ మాట నన్ను యెక్కువగా అంటుంటారు.

ము క్తి——నిన్ను కాదుర! నన్నంటుంటారు.

పద్మ——ఇదుగో. మిత్రులారా! "బ్రహ్మచారి శతమర్కటః" అంటే అర్థ మేమిటి ?

ర క్తి——ము క్తీ! ఆ మాటకు అర్థమేమిట్రా ?

ర క్తి——ఆ విషయం నీకెందుకు ?

ము క్తి——నాకు మాత్రమేం తెలుసునురా ?

ర క్తి——పద్మా! ఆ మాటకు అర్థమేమిటంటే "శిష్యులారా! మీరు చాలా బుద్ధివంతు"లని మమ్ము మెచ్చుకొనటం.

ముక్తి—కాకపోతే గురువుగారు మమ్మల్ని అలాగా యెందుకు పిలుస్తారు?
రక్తి—మనమీద ప్రేమరా!
ముక్తి—ఔమరా! గురుదేవులు బృహస్పతి భగవానుల వారికి మనమీద ప్రేమ- తారాదేవిగారికి చంద్రుడిమీద ప్రేమ.
రక్తి—మనకు పద్మమీద ప్రేమ.
పద్మ—మరి చంద్రుడికి యెవరిమీద ప్రేమ?
రక్తి—గురువుగారి మీద.
పద్మ—మరి గురువుగారు వచ్చి చంద్రుడేం చేస్తున్నాడంటే, యేమని చెప్తారు?
రక్తి—ఏమని యెందుకు చెప్తాం! ఉన్నమాటే చెప్తాం.
పద్మ—ఉన్నమాటంటే?
రక్తి—చంద్రుడేం చేస్తుంటే అదే చెప్తాం. అబద్ధం చెప్పిందాకా మాకేంపని.
పద్మ—చంద్రు డేంచేస్తున్నాడో మీకు తెలిస్తేగా?
ముక్తి—మాకు తెలిసిన విషయమే చెప్తాం.
పద్మ—నేను చెప్పినట్లు చేస్తారా?
రక్తి—నీవు మా మాట వింటానంటే—
పద్మ—మీ మాట విననిదాననైనచో యింతసేపు మీతో మాటాడుదునా?
ముక్తి—ఇపుడు మేమేం చెయ్యాలి?
పద్మ—ఆ విషయం రహస్యంగ చెప్పాలి.
రక్తి—చెప్పు, ఇక్కడెవ్వరూ లేరుగా?
పద్మ—అలా అనగూడదు. గోడలకు చెవులుంటవి.
రక్తి—అసలిక్కడ గోడలేలేవు.
ముక్తి—చెవులెలావుంటాయి!
పద్మ—అటుపోయి మాటాడుకొందాం రండి.
ముక్తి—సరే పోదాం పద.

(తెరపడును.)

(ఉద్యానవనంలో తార, చంద్రుడు ప్రవేశము.)

తార—చంద్రా ! ఇటుచూడూ !

చంద్రు—తారా !

తార—నీవు మనస్ఫూర్తిగ నన్ను ప్రేమించుచున్నావుగదూ ?

చంద్రు—ప్రేమించక నే నేమి చేయుదును ?

మ. చదువన్ వచ్చిన వేదశాస్త్రములలో సారంబు శూన్యంబునై
చదువన్ నేర్చితి కామశాస్త్ర మిపుడీచందాన, నన్నిందు స
మ్మద మందన్ దగజేయు నీవె సకలంబున్‌గాన ప్రేమింపకే
సుదతీ ! చేయగలట్టి కార్యమికనే జూడంగ కన్పించునే.

తార—చంద్రా ! నేను మాత్రము నీకై యెట్టిత్యాగ మొనరించితినొ యెరుంగవా !

చంద్రు—తారా ! నాకై నీవుచేసిన త్యాగమేదియునులేదు.

గీ. మన్మధుని తీవ్ర బాణాల క్రుంగి క్రుంగి
హాయినొంద నా కౌగిలియందుదాగ
భయములేక బంధంబుల పట్టిత్రెంపు
కొంటి వంగనా ! నా కొరకంటివేల ?

తార—చంద్రా ! మీ మగవారెన్నటికిని విశ్వాసపాత్రులుగారు జుమీ ! ఇందు నాస్వార్థమేగాని నీకుపయోగము లేదనుచుంటివా ?

ఉ. రాగములేక, భామ యనురాగములేక; వివేకహీనవై
జోగివిధాన నున్ననిను, సుంతయు సిగ్గును లజ్జవీడి స్త్రీ
భోగములందు దేల్చినొక పుణ్యలతాంగివి కీర్తినేయకే
నీగతి "స్వార్థురాలివ"ను టెంతయు న్యాయమె ? అత్రినందనా !

మరియును.

సీ. కొల్లాయిగట్టించి కొంప కొంపలవెంట
వైదిక వృత్తికై పంపలేదు.
మట్టియాకులుగోయ, మంచిదర్భలమోయ
చనుమంచు నిర్దయ ననగలేదు;

చెట్లనీడలక్రింద; జింకచర్మముపైన
పడియుండు మంచును నుడువలేదు;
కందమూలంబుల విందుగుడువబెట్టి
తినవైతివంచును తిట్టలేదు;
ఆ. వె. కష్టపెట్టలేదు; నిష్ఠురమనలేదు;
అవగరానిమాట లవగలేదు;
యింత సేయుచున్న నింత మంచియులేక
మేలుమరచి నీవు పలుకనేల ?
నీ మూలంబున నేనెట్టి నిందల పాలయితినో యెరుంగవా !
కం. ఇంటికి వచ్చిన బాలుడు
కంటికి నచ్చెనను నొక్క కారణమున తా
రెంతటి సాహసి యని, మ
న్నింతురె లోకులు నపనింద నేను భరింపన్.

చంద్రు—తారా ! వలదు వలదనుచుండ నన్నీమోహసాంద్రంబున ముంచి యిపుడు నన్నేల నిష్ఠురంబు లాడెదవు ?
ఉ. నీవు వచించు వాక్యములనే వినియున్ వినబోక; చర్యలా
భావమెరింగియున్ ప్రణయవర్తనమేమి యెరుంగనట్లు, నా
త్రోవల నేను బోయినను దోసమటంచు దలంచినావె ? న
న్నీ విషయంబులో నిలిపి యిప్పుడు నిష్ఠురమాడ నేటికిన్.
చ. గురుసతివైన కారణము కూడనిదంచును వేయిమార్లు నే
మరక వచించుచున్న; పలుమారులు మోసపు మోహచర్యలన్
బరపుచు ఘోరపాతకముపైబడ జేసిన నీవు; నన్ను నీ
తెరగున నిందసేయుటకు తెంపు వహించితివేల నీగతిన్.

తార—చంద్రా ! ఇపుడు నేనేమంటినని యిటు లందువు ?
ఉ. చక్కని వాడవౌట; తగు జవ్వని నేనయి యుంట; భర్త నా
మక్కువ దీర్చుచందమున మన్మథకేళిని దేలకుంట, ప్రేమలో
జిక్కిన దానవౌట, విను చేరితి; చేరిముదంబు నీకు నే
నెక్కలి గూర్చితిన్, ప్రతి నిమేషము నిన్ను దలంచు చుంటినిన్,

అట్టియెడ నన్ను గురించి నీ వలుసంతయు వచింపవు—నాయందను రాగమున్నటులు చరింపవు—నా తోడ చనవు గలిగించుకొని పర సంబు లాడవు.

ఉ. తియ్యనిభావముల్ గలిగి; దివ్యసుఖంబులదేలు, యవ్వనం
బయ్యెడ నిట్టి సందియము లంచు; చింత ఘటించి పోవుచో,
అయ్యో, సుఖించు టేమి? యిక—హాయిని పొందుటదేడ: చేయు నీ
నెయ్యమునందు కానదగునే పరిపూర్ణముదంబు, చంద్రుడా!

చంద్రు—నిజమేగాని, తారా! ఒకమాట విను.

గీ. పాపమైన పుణ్యమునైన, వ్రతముచెడితి
యిపుడు చింతించి చేయున దేమికలదు?
తొలగిపోయిన చేపడు ఫలముగూడ
తినగలేని దౌర్భాగ్యుని తీరుగాదె?

తార—అటులైన నీవిట్లు విచారంబున నుండు టేల?

చంద్రు—ఏలనందునా?

సీ. అతి మధురంబైన నగుకాక; మనతప్పు
సైరింపరాని దోషంబెసుమ్మ
చోరతనమునైన జారతనమునైన
దాగదనెడుమాట తథ్యమంద్రు
యెప్పుడే వేళకు నీ లోప మా గురు
దేవుండుగాంచునో తెలియరాదు
కాంచిన గురుడది కరుణించునా? కరు
ణింపకటోగ కోపించు నిజము

గీ. ఏమి నిందించునో? గురుడెంత చింత
పడునో? యేమికానుండె ఫలమదేమొ?
మదికిదోచి, కలవరంబు నొదవచేసి
సంతసంబెల్ల నాలోన సమయజేసె.

మరియును చెప్పవలయునన్న;

సీ. ఎండుటాకు కదలి, యిట్టె చప్పుడయిన
గురు డరుదెంచిన కరణి దోచు;
వడివడిగా మునిబాలకు లరుదేర
గురు డరుదెంచిన కరణి దోచు;
వేదాధ్య యనమందు వేళ సమీపింప
గురు డరుదెంచిన కరణి దోచు;
బిగ్గరగానను బిల్వ నెవ్వరునేని
గురు డరుదెంచిన కరణి దోచు;

గీ. చెట్టు లూగిన, పెంపుడు జింకలెగిసి
దుమికినను, పద్మవచ్చిన సమయమందు
గురుడు నరుదెంచి పిల్చిన కరణి దోచు
నీ భయంబుతోడ ముద మ దెట్లుగాంతు ?

తార—చంద్రా ! నీవింత పిరికివాడ వనుకొనలేదు సుమా !

చంద్రు—అవును. ఆ పిరికివానినే నీవు ప్రేమించితివికాదా ?

తార—ప్రేమించుటయేకాదు. వీరధైర్యంబు నుపదేశించుచున్నాను.

ఉ. పూరుష జన్మదాల్చి; మరిభూమి సుఖింప దలంచువాడు, తా
కోరిన నారిపొందు నొనగూడుటకై తగు సాహసంబుతో
మీరి చరించు వర్తనము మేటి తనంబగుగాని, నీవలెన్
భీరులునైనవేళ, నెరవేరునె కార్యము లెంతయేనియున్.

చంద్రు—ఇప్పుడు నన్నేమి చేయమంటివి ?

తార—అదియును చెప్పవలయునా ?

మ. చవియెన్ నీ వ్రతనిష్ట; నాదు సుఖమా సంప్రాప్తమయ్యెన్ గురుం
డనయంబున్ దిరుగాడుచుండు నెటులో, ఆ గోష్టిపోనాడి, నీ
మనముత్సాహమునన్ జెలంగ నను సంభాషించుచున్, నవ్వుచున్
మనటోప్పారదె ? కాక, చింతిలిన నేమంబౌనె నిప్పట్టునన్.

కావున కాగలదానికై వెరువక నత్యంత ముదంబున నాతో యాడుచు, పాడుచు; నవ్వుచు, సరసంబు లాడుచ ప్రొద్దుబుచ్చుము. చంద్రా మరియొక మాట చెప్పమందువా ?

చంద్రు—ఏమది ?

తార—నీవంటి యదృష్టశాలి మరెందునులేడు.

చంద్రు—నిజమా ?

తార—నిజము.

చంద్రు—ఎటులు ?

తార—తారా సంభోగానుభవంబున.

చంద్రు—గురుదేవుండు లేడా ?

తార—గురుదేవుని భార్యనను మాటయేకాని, ఆ గురుదేవుండు నావలన ననుభవించిన భోగమేమున్నది ? చంద్రా ! పేరునకు బృహస్పతి యిల్లాలునే కాని-ప్రేమకు చంద్రుని సతీమణిని కాకుందునా ? చంద్రా ! అంతియేకాదు. ప్రపంచంబున నిట్టివింత లెన్నియోగలవు. ఇటువినుము.

సీ. క్షష్టించి సౌధంబు గట్టజాలు నొకండు
వనరుమీర వసించు వాడొకండు;
వ్యవసాయమునుచేసి పండించున దొకండు
పాడిపంటల దినువా డొకండు;
కడుపు మాడ్చుక డబ్బు గడియించు నొక్కండు
వసుధ ననుభవించు వాడొకండు;
కత్తిబట్టి, పురరక్షణ నేయు నొక్కండు
సింహాసనము నధిష్టించు నొకడు;

గీ. పెండ్లియాడి పోషించెడు విభుడొకండు;
ప్రేమదీర సుఖించెడు ప్రియుడొకండు;
యిట్టిచిత్రంబు లీధరనెసగునెన్నొ
వాటికై యోచచేసిన ఫలముగలదె ?

అదటులుండనిమ్ము.

సీ. స్వర్గపథముగోరి సంయమిసాంద్రులు
యజ్ఞయాగాదుల నాచరించు;
స్వర్గపథముగోరి క్షత్రియవీరులు
సంగ్రామరంగాన సాహసించు;
స్వర్గపథముగోరి భాగ్యవంతులు, సప్త
సంతానములగాంచ సంచరించు;
స్వర్గపథముగోరి సర్వజనులు, శక్తి
గలుగు పుణ్యంబు సలుపుచుంద్రు;

గీ. స్వర్గపథముగోరియె నీవు శాస్త్రమనుచు;
పాపమమచు, నీతియటంచు బలికినావు;
అట్టి స్వర్గసౌఖ్యంబె నీ కబ్బెనిపుడు
భయమదేల ? యీగతి చింతబడయనేల ?

ఆ స్వర్గమున ప్రధానమైనది రంభాసంభోగము. వీరందరా రంభా సంభోగా పేక్షచేతనే స్వర్గపథమును కామింతురు. అట్టి రంభా సంభోగముకంటె యీతారా ప్రణయ మత్యంత యుత్తమంబైనది. ఎటు లందువేవి. రంభ దేవేంద్రుని యుపభార్య—నేను దేవేంద్రుని గురూత్తములవారి విజభార్యను. రంభ స్వర్గవాసులందరికినీ కైవస మగు చుండును - నేను నీకొక్కనికి మాత్రమే వశమైతిని. రంభ వేశ్య- నేను సంసారిని. అందువలన రంభాలింగనముకంటె నా యనురాగ ముత్తమంబనుట సందియము లేదు.

చంద్రు—తారా ! ఏది యెటులైనను యిపుడు నీ కోరికయే నెరవేరినదిగదా యిక నేమి ?

తార—చంద్రా !

ఆ. వె. ముసలి తాతతోడ, ముచ్చటాడగబోక
వెఱ్ఱిభ్రాంతియేల ? వేదమేల ?
రేలుబవలు గూడ ప్రాలుమాలిక లేక
జేరి ముదము నిందె పొందుమింక,

చంద్రు—తారా !

గీ. పవలు రేలును నిను గూడవచ్చు గాని,
చదువు నేర్పు విధమదెట్లు? సంధ్య యెట్లు?
కామభావాల లోనగు కాంత వగుట
పలుకుచున్నావు నీ విట్లు పద్మనేత్రి!

తార—చంద్రా! ఇంకను నీ పంతము మానవైతివి. ఔను. ఆడవారు విధేయత చూపుచున్నకొలది మీ మగవారు నిరసించుట సహజమే గదా? "కావుననే వనిత తనంత తావలచి వచ్చిన చౌక" యని పెద్ద లందురు.

చంద్రు—తారా! లోకవిషయంబును చెప్పితిని గాని, నేనేమంటి నని యిట్లు బిక్కోదవు?

చ. తనువును దాచి, ప్రాణముల తానొక గుప్పిట బట్టి; దొంగవై
చని, కడుబాధలం గుడిచి, సత్యము గోల్పడి, బంధు దూరమై
ధనమిడి, గౌరవం బుడుగు, తద్దయు గక్షలు పెంచు, నెందునన్
ఘనము నడంచు నేరికిని గాని, పరాంగనపొందు సౌఖ్యమే?

అని లోకానుభవమును చెప్పితిని. అంతమాత్రముననకే నీ వలుక చెందవలయునా?

తార—చంద్రా! ఈ ప్రణయ కలహంబుల కేమిగాని, ఆ సంపెంగ పుష్పమును చూడుము. ఎంత మనోహరముగ నున్నదో?

చంద్రు—తారా! ఈ సంపెంగ సౌందర్యము నీ చిరునవ్వుకంటె మనోహరముగ నున్నదా? లేదులేదు.

తార—ఆ సంపెంగ నావద్దనున్న........

చంద్రు—నీ విలాసము మరింత రాణించును.

తార—అదిచూచి యానందించుట నీ కిష్టముకాదా?

చంద్రు—కాకపోవుటేమి?

తార—ఐన, దానింగోవివచ్చి........

చంద్రు—నీ శిరోజంబులందుంచనా ? అటులే యొనర్తును. (లోనికిబోయి సంపెంగనుదెచ్చి తార కొప్పునందుంచి) తారా ! నీ సౌందర్యమిప్పుడు మరింత శోభిల్లుచున్నది.

గీ. అసలె సౌందర్య రాశివై యలరునీవు
కుసుమ సౌభాగ్యమును యొనగూడు కతన
అపర వనలక్ష్మివోలె నయనయుగంబు
ముందు వెలుగుచుంటివిగాదె యిందువదన !

అబ్బా ! ఏమిది ? నా వామనేత్ర మిట్లదరుచున్నది ? తారా నేడు నా కెందులకోగాని హృదయంబున భీతి యొదవుచున్నది సుమా ! ఏమిచేయుదును ?

తార—నీకు వామనేత్రముగాక, దక్షిణనేత్ర మదిరిన దినయొకటి యుండెనా ? నీ హృదయంబున భయంబులేని క్షణముండెనా ?

చంద్రు—తారా ! అందులకు నేనేమి చేయుదును ?

తార—నీవేమి చేయుదువు ? అది నా ప్రారబ్ధ కర్మము—

సీ. ముసలితాతకు నేను ముగుదనై పడియుండు
తలవ్రాలు లిఖియించె తమ్మి చూలి;
ఐనను, "సరిలెమ్మ"నుకొన్న, నాతండు
వలపునగన్న పాపంబు నెరుఁగ;
యెట్లులో దాని సహించుచు నుండి; నీ
రూపురేఖల గాంచి లొంగిపోతి;
నీవైన నా వాంఛ నెరవేర్చు నందాక
పడరాని యిక్కట్లు పడినదాన;

గీ. ఎట్టులెట్టులో నీ పొందు నింతగవిన
నొక్కనాడైన నీవు నా ప్రక్కజేరి
పలుకరింపవు; యెంతగ వలచియున్న
కొంచనేర నాభాగ్యంబు నింతుకైన.

చంద్రు—అటులన్న నేను మాత్ర మేమను కొనవలయును ? తారా ! అట నున్న మల్లెపొద వద్దకు బోవుదము రమ్మ. అందైన మనసు విశ్రాంతి నొందునేమొ ?

తార—అటులనే పోవుదము, నడువుము.

(ఇరువురు కొంత దూరము నడతురు.)

చంద్రు—తారా ! ఇటుచూడు. నాగమల్లె యెంత గాఢముగ నల్లుకొని యున్నదో ?

తార—ఔను. ఆ నాగమల్లె సతీపతుల యనురాగ బంధమట్లు నలుముకొని యున్నది. చంద్రా ! ఈ మధుమక్షకము ప్రియురాలి హృదయ మక రందము గ్రోల నెంతదూరమునుండి వచ్చినదో యెరుంగుదువా ?

చంద్రు—ఔను తారా !

ఆ. వె. చెట్టు, చేమదాటి, గుట్టపుట్టలుదాటి
కుసుమ కన్నెపొందు గోరివచ్చె
దూరమెంతయైన నారి పొందునుగోరి
రసికులైనవారు రాకయున్నె ?

తార—ఎంతదూరంబు నుండియో యీ తేనెటీగ తన ప్రియురాలిని చూడ వచ్చినది గదా ? దరినున్న నీ ప్రియురాలిపై నీకిట్టి మమకారమేల లేకపోవలయు ?

చంద్రు—తారా ! నీకు నాయెడగల ప్రేమాతిశయంబున నిటులను చుంటివిగాని. నేను నిన్నుగాక మరెవ్వరిని ప్రేమించితిని ?

సీ. పైడిగిన్నెలలోన పాల్పోసి చేచేత
పీడక నాకు ద్రావించునెవరు ?
స్నానంబుసేయ వస్త్రంబును దెచ్చియు;
దడిలేక యొడలెల్ల దుడుచునెవరు ?
శాకంబులన్నియు చవిచూడ మంచున
చీటి మాటికి నోటచేర్చునెవరు ?
కలువరించెదనంచు కడుప్రేమతోడ నా
పై చెయినుంచియే పండునెవరు ?

గీ. "చీరెమార్చనా ? పూమాల చేతికిడన ?"
అనుచు మాటిమాటికి చేరి యడుగునెవరు ?
అట్టినీవు నాదానవై యిట్టులుండ
కొరతలేదు నాకింకనో కోమలాంగి ?

తార—ఆహా ! ఇంత మధురమైన మాటలు నీ నోట నెంత కాలమునకు వినగల్గితివి ?

చంద్రు—దానికేమిగాని, యింక యింటికి బోవుదమా ?

తార—వంటింటికా ? పడకటింటికా ?

చంద్రు—ఏయిల్లయినను మనయింటికే బోవుదము,

తార—ఒహో ! మనయిరువురకు వివాసయోగ్యమగు యింటికా ? అటులనే పోవుదము రమ్ము.

చంద్రు—తారా ! గురువుగారు స్వర్గమునకు బోయి చాలా రోజులైనది. ఎపుడు వత్తురో, యేమొ ?

తార—వారచట నొక యాగంబు నేయింప బోయిరి. మరేమియుభయము లేదు. నిర్విచారముగ నుందము రమ్ము.

గీ, అమరయాగ మారంభంబునైన పిదప
నారు మాసంబులవరకు వారు రారు;
నాటి వరకు మనకునెట్టి లోటులేదు.
సంశయింపక రమ్మింక చందమామ !

(తెర బడును)



ఓమ్

# తారాశశాంకము

## షష్ఠమాంకము

(ఆశ్రమము ముందు రక్తి, ముక్తి ప్రవేశము)

రక్తి—ముక్తీ!

ముక్తి—రక్తీ!

రక్తి—చంద్రుడు మరీయింత విచ్చలవిడిగ తిరగటం నాకేమీ బాగుగ లేదురా?

ముక్తి—నాకు బాగున్నదంటావా?

రక్తి—మరి యెలా చేయటంరా?

ముక్తి—ఎలాచేసినా మనమేంచేస్తాం?

రక్తి—నిజం. నిజం

(పైన చప్పుడు వినవచ్చును)

ముక్తి—ఏమిటిరా, విమానం ధ్వనివలె నున్నది?

రక్తి—ఔనురా! గురుదేవులు బృహస్పతి భగవానులవారు.

ముక్తి—అయ్యయ్యో. ఎంతప్రమాదం—ఎంతప్రమాదం.

రక్తి—కొంప మునిగి పోయిందిరా!

ముక్తి—చంద్రా! చంద్రా!

(పద్మ ప్రవేశము.)

పద్మ—చంద్రుడులేడు, గింద్రుడులేడు. అట్టెవాగక నోరు మూసుకొని పడియుండు.

ము_క్తి—నేనుగాను. నీవు పడియుండాలి. అరుగో బృహస్పతి భగవానుల
వారు వస్తున్నారు.

పద్మ—అమ్మయ్యో! అమ్మా! తారాదేవీ! తారాదేవీ! ప్రమాదం. ప్రమా
దం. (అంటూ పరుగెత్తును.)

(బృహస్పతి ప్రవేశము.)

బృహ—ఏమిది? ఇందెవరును కనుపించరేమి?

సీ. పతిపాదసేవయే పరమధర్మ మటంచు
తగుభ_క్తి మీరు నా తారయేది?
అత్యంత గురుభ_క్తి నలరారు సద్గుణ
శాలి, యనందగు చంద్రుడేడి?
పరిచారికాధర్మ మరయ పాలించుచు
భవ్య పథమిదని పద్మ యేది?
స్నాన సంధ్యా తపజపములందేనియు
ప్రాలుమాలని ము_క్తిరక్తులేరి?
గీ. వినపడ దిదేమి నా కిందు వేదమొకటి?
కనపడ దిదేమి నేడు నొక్కరునుగూడ?
పిలుచువారులేరిట-లేరు పలుకువారు
కత మిదేమి? మనంబున కలతలేమి?

(ఎదుటచూచి) ఓహో! ద్వారము బంధించియున్నదే? ఒకవేళ
తారాపద్మలు స్నానములు చేయుచుండిరా! చంద్రాదులు నితర కార్యం
బులకై పోయియుండిరికాబోలు. (నిదానించి చూచి) అరుగో ప్రియ
శిష్యులగు ర_క్తిముక్తు లిందేయున్నారు. ఓరీ! శిష్యులారా!

ర_క్తి; ము_క్తి—(సమీపించి) నమస్కారం. భగవాన్!

బృహ—దీర్ఘాయుష్మాన్భవ! నాయనలారా! ఆశ్రమ సమాచారములేమి?
అందరును క్షేమముగ నున్నారా?

ర_క్తి—తమ దయవలన.

బృహ—చంద్రుడు బాగున్నాడా?

ము_క్తి—ఉండక వాడికేం గురుదేవా! మీరు లేకపోయినను తారాదేవి చంద్రుని కే లోపమూలేకుండ చూచుచున్నదిస్వామీ!

ర_క్తి—అవునుదేవా! మీరులేని కొరతయేలేదు భగవాన్.

బృహ—తారా పద్మ లెందుబోయిరి?

ము_క్తి—అందరు యింటిలోనే వున్నారుస్వామీ!

బృహ—అటులనా! తారా! తారా!

(లోపల)—ఎవరు?

బృహ—ఎవరా? నేను బృహస్పతిని.

(లోపల)—మీరా! స్వామీ! వచ్చుచున్నాను.

బృహ—ఏమీ, యీ యాలస్యము?

(లోపల)—స్నానముచేసి వస్త్రముల ధరించుచున్నాను. పద్మా! మీ గురుదేవులవారు దయచేసిరి. తలుపుతియ్యవే.

బృహ—పద్మా! పద్మా!

(లోపల)—వస్తున్నాను గురుదేవా! (తలుపుతీయును.)

బృహ—(లోపలకు నడిచిచూచి) ఏమీ యీ చిత్రము? నా యాశ్రమంబున మున్నెన్నడులేని అగరుచందన గంధంబులు విరజిమ్ముచున్నవి - నూతనాలంకారంబులు గోచరించుచున్నవి - నేను నా స్వగృహంబునకే వచ్చితినా! మతి భ్రమించి సానింటికి బోయితినా? అంతయు చిత్రముగ నున్నదే?

మ. ఇదియేనాముని యాశ్రమంబు? మరియేదేసాని వాసంబులో
పదముల్ బెట్టిన వాడనా? మరుడు తావర్తించు సౌధంబ? నా
హృదయంబీగతి భ్రాంతినొందెన? ఇదే మీ చిత్ర మీరీతినిన్
మదికాలోచన గల్గు హేతువది యే మర్మంబునై దోచెడిన్

(ఎదుట చూచి) ఇందున్న దెవరు?

చంద్రు—నేను భగవాన్! చంద్రుడ్ని;

బృహ— నీవా చంద్రా ! ఇందుంటివేమి ? ఇటు లుంటివేమి ! నీ వేష భాష లన్నియు మారినటు లున్నవే ?

సీ. ఊర్ధ్వ పుండ్రంబుల నొప్పారు ఫాలంబు
కస్తూరి బొట్టుల గ్రాలుచుండె;
చెంగావి వలువల చెలువొందు దేహంబు
పట్టుజరీయంచు బట్టగట్టె;
మానుపూసల పేరులేని దాల్చుగళంబు
మంచి ముత్యాలతో మించియుండె;
అధ్యయన స్థానమందు వెలయు నీకు
శయ్యాభవనమిట్లు స్థానమయ్యె;
గీ. నను గణనయంత వందన మనెడు నీవు
పిలిచిననుగాని పలుకంగ వెరచితీవు ?
ఏమి కారణ మిటులయ్యె ? నేల భయము
నీకు ? చెప్పవేటికి చంద్ర ! నిక్కువంబు ?

చంద్రు—అపరాధిని గురుదేవా ! మన్నింపుము.

బృహ— అపరాధమేమి ? మన్నించుటేమి ?

పద్మ—గురుదేవా ! అపరాధి చంద్రుడు గాడు— నేను.

బృహ—ఏమి ?

పద్మ—నేను....నేరం చేశాను....కామాంధురాలినై— కన్నుమిన్నుగానక, యింద్రియ వాంఛలకు లోబడి, చంద్రు డెంత నిరాకరించినను వినక రతిక్రీడలకు ప్రేరేపించి, పవిత్రమగు ముని యాశ్రమంబునకు కళంకము దెచ్చిన పాపురాలిని నేను— ఇందు చంద్రుడుగూడ నిర్దోషియే.

తార—పద్మా ! నీకు నాయందుగల భక్తిశ్రద్ధల కానందమేగాని; భర్తృద్రోహినైన నాయందు నీ వీ సాహసము చూపతగదు.

గీ. భర్తృ ద్రోహంబు సేయుటే పాపకరము;
అందు శిష్యుని పొందు మహానరకము;
బొంకి, యితరులపై ద్రోసిపుచ్చు ఘోర
పాతకం బింక నేటికే పద్మ ! చెపుమ !

స్వామీ ! ఈ నేరముచేసినది పద్మకాదు. నేను. కామ మెరుగవి చంద్రునకు కామ భావాలు పురికొలిపినది నేను-కళంకములేని మీ యాశ్రమములో కళంకము దెచ్చినది నేను-అత్యుత్తమంబగు నా పాతి వ్రత్యము నథఃపతనము గావించు కొన్నది నేను. ఇందు పద్మా చంద్రులు నిర్దోషులు.

చ. అసమతపః ప్రభావముగలట్టి మహాత్ములు మీరు; ఇప్పుడీ
దొసగొనరించు వారలను దూషణసేయక, ప్రక్కవారిపిన్
కసరిన దోషమౌ; జగము క్రమ్మర మిమ్ముల నిందజేయు, నౌ
ర ! సురగురుండు మూర్ఖమున గ్రాలెనటంచును ముందువెన్కలన్.

మరియును;

గీ. తనదు భార్యపైగల ప్రేమతత్వమందు
మాటమాత్ర మనకయె మోమోట పడుచు
నేరమెల్ల దాసితలను వింపెననుచు
పదుగురాడుటే నిక్కంబు ప్రాణనాథ !

కావున—

గీ. ఇంద్రియంబుల గెల్చు శక్తింత లేక
చేసియున్నాను మీ యందు దోసమేను.
ఫలిత మందుటగూడ నా వంతుగాని
పరులు నిందనార్హులుగారు పరమయోగి !

బృహ—తారా ! ఈ ఘోరపాతకంబు చేసినది నీవా ?

గీ. భర్తృ ద్రోహంబు నేయుటే పాపకరము;
అందు శిష్యుని పొందు మహానరకము;
బొంకి, యితరులపై త్రోసిపుచ్చు ఘోర
పాతకం బింక నేటికే పద్మ! చెపుమ!

స్వామీ! ఈ నేరముచేసినది పద్మకాదు. నేను. కామ మెరుగని చంద్రునకు కామ భావాలు పురికొలిపినది నేను-కళంకములేని మీ యాశ్రమములో కళంకము దెచ్చినది నేను-అత్యుత్తమంబగు నా పాతి వ్రత్యము నథఃపతనము గావించు కొన్నది నేను. ఇందు పద్మా చంద్రులు నిర్దోషులు.

చ. అసమతపః ప్రభావముగలట్టి మహాత్ములు మీరు; ఇప్పుడీ
దొసగొనరించు వారలను దూషణ నేయక, ప్రక్కవారివిన్
కసరిన దోషమౌ; జగము క్రమ్మర మిమ్ముల నిందజేయు, నౌ
ర! సురగురుండు మూర్ఖమున గ్రాలెనటంచును ముందువెన్కలన్.

మరియును;

గీ. తనదు భార్యపైగల ప్రేమతత్వమందు
మాటమాత్ర మనకయె మోమోట పడుచు
నేరమెల్ల దాసితలను వింపెననుచు
పదుగురాడుటే నిక్కంబు ప్రాణనాథ!

కావున—

గీ. ఇంద్రియంబుల గెల్చు శక్తింత లేక
చేసియున్నాను మీ యందు దోసమేను.
ఫలిత మందుటగూడ నా వంతుగాని
పరులు నిందనార్హులుగారు పరమయోగి!

బృహ—తారా! ఈ ఘోరపాతకంబు చేసినది నీవా?

ప్రకృతి సిద్ధమైన యింద్రియవాంఛలు నన్నే జయించినవి. వయోజన భావంబులు నన్ను కైవసము చేసుకొన్నవి. విధి వారింపరానిదై పోయినది. పాపము జరిగినది.

బృహ—ఇప్పుడు నేనేమి చేయవలయును ?

తార—పూజ్యుల యిచ్ఛయగునట్లు.

బృహ—చంద్రా ! ఎంతపని చేసితివి ?

ఉ. ఇంతటి దుర్మదాంధుడవు నీవు నటంచు దలంపనైతి ర
వ్వంతయు; నేను నీయెడల నాత్మజభావము జూప నీవు దు
స్వాంతత తల్లిబోలు గురుపత్నినిగూడితివౌర ! చంద్ర ! ని
న్నంతమొనర్తు నిప్పుడె దురంత మహోగ్రహ వీక్షణంబులన్,

తార—మహామునీ ! మహామునీ !

బృహ—ఏమి ?

తార—ఇందు చంద్రునినిందింప వానిదోస మిసుమంతయులేదు.

బృహ—మరి యీలోపమంతయు నాదందువా ?

తార—కావచ్చును. ఆలోచించి చూచిన మీలోపముమాత్రము లేదనుటెట్లు?

బృహ—ఛీ కులటా ! పవిత్రంబగు మునియాశ్రమంబును కలుషంబు చేసినదిచాలక యింకను నాలోపమనుచుంటివా? ఇట్టి మహాదారుణ వాక్యంబులాడిన నీ నాలుక చీలికలుగానేల శపింపరాదు ?

తార—శపింపరాదని నేనంటినా మహామునీ ? కాని, మీరు శపించబోవుటకు ముందు నామాటలను పూర్తిగా విను టావశ్యంబగునని మాత్రము వేడుకొనుచున్నాను.

బృహ—ఏమి ?

తార—ఏమందురా ? నేను కాపురమునకు వచ్చి యెంత కాలమైనదో మీకు తెలియనిది కాదు.

ప్రకృతి సిద్ధమైన యింద్రియవాంఛలు నన్నే జయించినవి. వయోజనభావంబులు నన్ను కైవసము చేసుకొన్నవి. విధి వారింపరానిదై పోయినది. పాపము జరిగినది.

బృహ—ఇప్పుడు నేనేమి చేయవలయును ?

తార—పూజ్యుల యిచ్ఛయగునట్లు.

బృహ—చంద్రా ! ఎంతపని చేసితివి ?

ఉ. ఇంతటి దుర్మదాంధుడవు నీవు నటంచు దలంపనైతి ర
వ్వంతయు; నేను నీయెడల నాత్మజభావము జూప, నీవు దు
స్స్వాంతత తల్లిబోలు గురుపత్నినిగూడితివౌర ! చంద్ర ! ని
న్నంతమొనర్తు నిప్పుడె దురంత మహోగ్రహ వీక్షణంబులన్.

తార—మహామునీ ! మహామునీ !

బృహ—ఏమి ?

తార—ఇందు చంద్రునినిందింప వానిదోస మిసుమంతయులేదు.

బృహ—మరి యీలోపమంతయు నాదందువా ?

తార—కావచ్చును. ఆలోచించి చూచిన మీలోపముమాత్రము లేదనుటెట్లు?

బృహ—ఛీ కులటా ! పవిత్రంబగు మునియాశ్రమంబును కలుషంబు చేసినదిచాలక యింకను నాలోపమనుచుంటివా ? ఇట్టి మహాదారుణవాక్యంబులాడిన నీ నాలుక చీలికలుగానేల శపింపరాదు ?

తార—శపింపరాదని నేనంటినా మహామునీ ? కాని, మీరు శపించబోవుటకు ముందు నామాటలను పూర్తిగా విను టావశ్యంబగునని మాత్రము వేడుకొనుచున్నాను.

బృహ—ఏమి ?

తార—ఏమందురా ? నేను కాపురమునకు వచ్చి యెంత కాలమైనదో మీకు తెలియనిది కాదు.

ఏది యెటులేనియు మీరు దండనార్హులు. తారా :

గీ. కపట నాటకమాడిన కారణమున
పతికి ద్రోహంబుచేసిన పాతకమున
నింద్రి యానేకవాంఛల నింకబాసి
తారలందు కలసి పొమ్ము తార ? నీవు.

చంద్రా: నిన్నును క్షమింపరాదు.

గీ. గురు సతీమణి యంచును కొంచెమైన
శంకలేక నీ చందాన సలిపితీవు;
ముందువారైన వినుచూచి బుద్ధినొంద
నంతమై పొమ్ము కృష్ణ పక్షాంతమందు.

(నారదుడు-శుక్రాచార్యులు ప్రవేశము.)

నార—నారాయణ ! నారాయణ !

బృహ—నారదా ! ఈవిషయ మప్పుడే నీ వరకు వచ్చినదా ? ఐన నిక నేమి ? లోకంబు లన్నింటికిని ప్రాకిన దన్న మాటయే.

నార—లేదు బృహస్పతీ ! లేదు—లేదు. నాకంటే ముందుగ నీ శుక్రాచార్యు నకు తెలిసి వచ్చుచుండ నేనును వచ్చితిని.

బృహ—ఎందులకు ?

శుక్రా—ఎందులకా ? నీ భార్యచేసిన తప్పును ఋజువుచేసి నీకు సంఘ ములో వెలివేయుటకు ?

బృహ—ఏమీ ? నాకు వెలివేయుటయా ?

శుక్రా—నీకు గాకున్న మరి నాకా ?

బృహ—కాదా ?

శుక్రా—అదెట్లు ?

బృహ—తెలివితక్కువ పనులు చేసినందులకు—

శుక్రా—అనగ ?

ఏది యెటులేనియు మీరు దండనార్హులు. తారా :

గీ. కపట నాటకమాడిన కారణమున
పతికి ద్రోహంబుచేసిన పాతకమున
నింద్రి యానేకవాంఛల నింకబాసి
తారలందు కలసి పొమ్ము తార ? నీవు.

చంద్రా: విన్నను క్షమింపరాదు.

గీ. గురు సతీమణి యంచును కొంచెమైన
శంకలేక నీ చందాన సలిపితీవు;
ముందువారైన వినుచూచి బుద్ధినొంద
నంతమై పొమ్ము కృష్ణ పక్షాంతమందు.

(నారదుడు-శుక్రాచార్యులు ప్రవేశము.)

నార—నారాయణ ! నారాయణ !

బృహ—నారదా ! ఈవిషయ మప్పుడే నీ వరకు వచ్చినదా ? ఐన నిక నేమి ? లోకంబు లన్నింటికిని ప్రాకిన దన్న మాటయే.

నార—లేదు బృహస్పతీ ! లేదు—లేదు. నాకంటే ముందుగ నీ శుక్రాచార్యునకు తెలిసి వచ్చుచుండ నేనును వచ్చితిని.

బృహ—ఎందులకు ?

శుక్రా—ఎందులకా ? నీ భార్యచేసిన తప్పును ఋజువుచేసి నీకు సంఘములో వెలివేయుటకు ?

బృహ—ఏమీ ? నాకు వెలివేయుటయా ?

శుక్రా—నీకు గాకున్న మరి నాకా ?

బృహ—కాదా ?

శుక్రా—అదెట్లు ?

బృహ—తెలివితక్కువ పనులు చేసినందులకు—

శుక్రా—అనగ ?

సీ. ప్రాయ మనుసరించి వైవాహికంబులు
జగము నందంతయు జరుగుగాత;
పతిభక్తితోడుత సతులెల్ల నీతి నీ
మంబుల బాయక మసలుగాత;
గురుభక్తి మీరక వరశిష్యు లందరు
భవ్యచరిత్రులై వరలుగాత;
లోక మంతయును శుశ్లోక వర్తనమందు
నాదర్శులై కీర్తి నందుగాత;
గీ. పృధివి సౌఖ్యంబు లనుభవింత్రు గాత;
ఆయురారోగ్యములతోడ నలరు గాత;
ధర్మదేవతనే గొల్చి దనరు గాత;
శ్రీహరి కరుణ నెవ్వేళ జెలగు గాత.

బృహ—తథాస్తు,

మంగళమ్



Acc.No. 6038
894.8132
VEG
రు-1.40

నందా ప్రెస్, మారీసుపేట-తెనాలి